i

# విషయసూచిక

# పరిచయం

ఈపుస్తకం 1943 మే, జూన్ నెలల్లో రెండు భాగాలుగా విశ్వ సాహిత్యమాలలో వెలువడింది. దానినే సంస్కరించి నేటికి ఒకే పుస్తకంగా తీసుకు రాగలిగేము.

విశ్వనాటకరంగం మీదికి పెట్టుబడిదారీ విధానం, తనతోకూడ శ్రామికవర్గాన్ని వెంటబెట్టుకు వచ్చింది. విప్లవవ్యతిరేకవర్గాలైన జమీందారీ ప్రభువుల ఆధిపత్యాన్ని త్రోసిరాజనడంలో శ్రామికవర్గాన్ని ఉపయోగించుకుంటూన్నా, వారంటే పెట్టుబడిదారీ వర్గానికి పక్క ఎదురుగానే వుంటూ వచ్చింది. మొత్తంమీద బూర్జువా ప్రజాతంత్రంవైపు ముందుకు పోదామనే ఉత్సాహమే 19 వ శతాబ్దపు మొదటిభాగంలో బూర్జువా వర్గం యొక్క చర్యల్లో చూస్తాం.

1850 కి పూర్వం కార్మికోద్యమంలో అనేక పెట్టీబూర్జువా సిద్ధాంతాలు వ్యాపించి వుండి, వాట్లన్నిటిలోనూ సిద్ధాంత, ఆచరణల్లో నిరంతరం పరస్పరపోరాటాలు జరుగుతూనే వుండేవి. 1850 తర్వాత వీటన్నిటితోనూ పోరాటానికి నిలబడింది మార్క్సిజమ్ కార్మికోద్యమంలోని పెట్టీబూర్జువా పోకడలతో ఒక వైపునా, బూర్జువావర్గంతో రెండో వైపునా పోరాడుతూ మార్క్సిజమ్ బలపడుతూవచ్చింది. ఈపోరాటాల ఫలితంగానే శాస్త్రీయమైన కమ్యూనిస్టుసిద్ధాంతం. యెత్తుగడలు, పోరాట విధానాలు,—నిర్మించబడినాయి.

జమీందారీయుగంలో చక్రవర్తుల చరిత్రలే మానవజాతి చరిత్రలుగా వ్రాయబడ్డాయి; పెట్టుబడిదారీయుగంలో ఆయాదేశాల ధనికవర్గా

లకి ప్రతినిధులైన ప్రభుత్వాల పోటీలు, స్పర్థలు, యుద్ధాలు,—యివే మానవచరిత్రగా చలామణీ అయింది.

నేడు మానవచరిత్ర వ్రాయాలంటే కార్మికపోరాటాల చరిత్ర, రైతుపోరాటాల చరిత్ర వ్రాసే తీరాలి. అందుకనే నిజమైన మానవచరిత్ర వ్రాయడం, యిటీవలనే, మన శతాబ్దిలోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. ఈచిన్న పుస్తకంలో 1871 పారిస్‌కమ్యూన్‌వరకూ వివిధయూరోపియన్ దేశాల్లో జరిగిన కార్మికపోరాటాలచరిత్ర, పాఠాలరూపంలో వ్రాయబడింది.

కార్మికవర్గవిముక్తికై జరుగుతూన్న నేటి పోరాటాల్లో అగ్రగాములుగా వున్నవారికి యిందులోని విషయాలు చాల ఉపయోగపడతాయి. గతపోరాటాల్లో మనయెత్తులు, చేసిన పొరబాట్లు, నేర్వవలసిన పాఠాలు, యివన్నీ విస్పష్టం అవడమేగాక ముందు కార్యవిధానాన్ని నిర్ణయించుకోడానికికూడ యెంతో తోడ్పడుతుంది.

కార్మికోద్యమవర్కర్లు పాఠ్యగ్రంథంగా తీసుకోడానికి తగినట్లుగా యిందులో ప్రశ్నావళికూడ వుంది. నేడు కఠినపరీక్షకు గురి అవుతూన్న ఆంధ్రకార్మికవీరుల కిది ఉపయోగపడితే మాకృషి సార్థకమౌతుంది.

1—1—1947,
రాజమండ్రి.

ఇట్లు
మహీధర జగన్మోహనరావు
సంపాదకుడు

విశ్వసాహిత్యమాల ౩౦, ౩౧

# ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర

1848 వరకూ యూరోపియన్ కార్మిక ఉద్యమాలు

మొదటి యింటర్ నేషనల్, పారిస్ కమ్యూన్



అనువాదం:

రామమోహన్



విశ్వసాహిత్యమాల

రాజమండ్రి

5

# ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర

## 1848 నాటి ఫ్రాన్సు విప్లవం

## యూరపులో పారిశ్రామిక విప్లవం

1789 లో ఫ్రాన్సు మహావిప్లవం జరిగింది. అదే మొదలు పశ్చిమ యూరపులోని దేశాలన్నీ పారిశ్రామికవిప్లవాలతో పూర్తిగా మారిపోవడానికి. యూరపుఖండంలోకంటె ఇంగ్లాండులో ఈ విప్లవం ఎక్కువ మార్పును త్వరలో తీసుకువచ్చింది. చిన్నపరిశ్రమలస్థానే విశేషంగా సరుకులు తయారుచెయ్యగల భారీపరిశ్రమలు ఏర్పడినాయి. స్వల్పఉత్పత్తి స్థానాన్ని పెట్టుబడిదారీ ఉత్పత్తి ఆక్రమించడంవల్లనూ, యంత్రాలూ, ఫ్యాక్టరీలు బయలుదేరడంవల్లనూ; వ్యవసాయంలోకూడా పెట్టుబడిదారీ విధానం ఏర్పడడంవల్లనూ సమాజంలోని వర్గశక్తులలో కొత్త కొత్త సమ్మేళనాలు కలిగినాయి.

స్వల్ప ఉత్పత్తిదారులు తమ చేతి పరిశ్రమలకీ, తమ స్వగ్రామాలకీ దూరంచేయబడి శ్రామికులలో చేరిపోయేరు. ఆర్థిక క్లేశాలు కారణంగా శ్రామికుల జీవితవ్యయప్రమాణంకూడా క్రమక్రమంగా క్షీణించిపోతూంది. కూలివాడు చాతుర్యంతో నిమిత్తంలేక యంత్రంమీదనే పనిచేయవలసిరావడంచేతా, స్త్రీలూ- పిల్లలూకూడా ఎక్కువగా పరిశ్రమలలోకి చేర్చుకోబడుతూండడంచేతా, కూలి కొద్దో గొప్పో తగ్గింది. కొత్తగా పరిశ్రమలలోకి వస్తూన్నవారికి, అక్కడ చెయ్యవలసినపని ఎంతో బాధాకరంగా వుంటూంది. కూలివాడు రోజులో 12 - 14 గంటలు పనిచేయవలసి వుంటూంది. కొత్తగా ఏర్పడిన ఈపారిశ్రామిక కేంద్రాలలో ఇళ్ళసమస్య

మరీభయంకరం. టైఫాయిడూ, కలరాలకి అవి పుట్టినిళ్లు. నిరుద్యోగం ఒక సమస్యగా పరిణమించింది. నేరాలు అధికం అయినాయి. ఉటోపిస్టు అయిన ఫౌరియరు ఈకాలాన్నిగురించి వ్రాస్తూ, "అధికోత్పత్తి దారిదార్ర్యానికీ - దురవస్థలకీ మూలం అయింది" అన్నాడు.

ఈ సమయంలోనే వర్గశక్తుల పరస్పరసంబంధాలలో గొప్ప మార్పు ఏర్పడింది. శ్రామికవర్గం అభివృద్ధిచెంది, వర్గచైతన్యాన్ని పొందింది. పరిశ్రమలు అభివృద్ధి చెందినకొలదీ లూఠీలు, తిరుగుబాట్లూ హెచ్చినాయి. ఏమి చేయడానికీ దారిలేని శ్రామికులలో విప్లవభావాలు రేకెత్తసాగినాయి. లుడ్డైట్ల ఉద్యమం, చార్టిస్టుల తిరుగుబాటు (ఇంగ్లండులో) ఫ్రెంచి శిల్కుపరిశ్రమకి కేంద్రం అనదగిన 'లయాన్సు' లో 1831 లోనూ, 1834 లోనూ వచ్చిన రెండు తిరుగుబాట్లు, 1844 సైలీషియా (జర్మనీ) నేతపనివారి తిరుగుబాటు, శ్రామికవర్గంయొక్క ప్రత్యేకతనీ, బూర్జువావర్గంతో దానికి గల శతృత్వాన్నీ స్పష్టం చేసేయి.

పరిస్థితులు అంతకంతకి దుర్భరం అయి, శ్రామికవర్గంలో చైతన్యం హెచ్చినకొలదీ ప్రపంచంయొక్క దృష్టి ఈనూతన వర్గం వైపు తిరిగింది. ఈనూతన పరిశ్రమల మూలంగా జీవితాధారాలు కోల్పోయిన చిన్న ఉత్పత్తిదారులూ - చేతిపనివారలనుండీ, విద్యావంతులనుండీ కొందరు ఊహాపరులు ముందుకు వచ్చేరు. సమాజంలోని ప్రధాన సమస్యలు కేవలం రాజకీయ ప్రాముఖ్యతకలవి మాత్రమే కాదనీ, రాజును తప్పించి ధనికవర్గం అధికారంలోకి వచ్చిన మాత్రాన ప్రజల దుస్థితి తొలగదనీ, వ్యక్తిగత స్వాతంత్ర్యం - స్వేచ్ఛావాణిజ్యం మొదలయిన శబ్దాలకి అర్థంలేదనీ చెప్పేరు - ఉన్నదంతా సాంఘిక సమస్యమీదనే వుంది. సంఘంలో అసమానత్వం పోగొట్టాలి. శ్రామికవర్గం యొక్క

దారిద్ర్యం నాశనం చెయ్యబడాలి - అని గుర్తించేరు. ఇదే ఉటోపియను (ఊహాజనిత) సోషలిజానికి పుట్టుక.

## ఉటోపియన్ సోషలిజం

ఉటోపియనిస్టులలో ఎక్కువభాగం విద్యావంతులనుంచి వచ్చిన వారే. సంఘంలోని దుస్థితికీ- శ్రామికవర్గంలోని విప్లవభావాలకీ హడలి పోయి ఆ దుస్థితిని కొంతవరకయినా సర్దుబాటుచేయాలనీ, సంఘంలో అసమానత పోగొట్టాలనీ తలచే ధనికవర్గంలోంచి కొందరు వచ్చేరు. బహుళోత్పత్తిచెయ్యగల పరిశ్రమలవలనా, పెట్టుబడివలనా, పెట్టుబడి ప్రోగుపడిపోవడంవలనా అంతకంతకి ఎక్కువగా శ్రామికులలో చేరి పోతూన్న చిన్నవుత్పత్తిదారుల ప్రతినిధులు కొందరు వీరిలో లేకపో లేదు. ఈ ఉటోపిస్టులలో ప్రముఖులు. రాబర్టు ఓవెన్ (1771-1858); ఛార్లెస్ ఫొరియరు (1771-1837); సెంట్ సైమన్ (1760-1825). ఈఉటోపిస్టులు ప్రారంభంలో పెట్టుబడిదారీ విధానంయెడ చిన్నఉత్పత్తి దారులకిగల అసహ్యాన్నే ప్రకటిస్తూ వ్రాసేరు. కాని వారి భావాలు క్రమంగా సోషలిజంయొక్క స్వరూపాన్ని దాల్చేయి.

ఆధునిక పెట్టుబడిదారీ సమాజాన్ని లేశలేశాలుతీసి విమర్శించ డమే ఈ ఉటోపిస్టులు చేసిన మొదటి మహోపకారం. ఫ్రెంచి విప్లవా నికి పూర్వంనాటి తత్త్వవేత్తలంతా, జమీందారీ విధానాన్ని నాశనంచేసి, ప్రజలకి రాజకీయ స్వాతంత్ర్యం కలిగిస్తే మానవసమాజం సుఖశాంతు లతో తులతూగుతుందని భావించేరు. ఫొరియరూ - ఓవెనూ ఈఅభి ప్రాయం శుద్ధపొరపాటని నిరూపించేరు. ధనికవర్గం చేతులలోనికి రాజ్యాంగసూత్రాలు మారేక పనివారిస్థితి మరింత దుర్భరం అయినట్లు

వారు నిరూపించేరు. ఉదాహరణకి ఫొరియరు రచనలని చూడండి. ప్రస్తుత సాంఘిక విధానాన్ని ఆతడు కూలంకషంగా విమర్శించేడు. వర్తకులు, కొంతమంది పరిశ్రమదారులు, వకీళ్ళు, పన్నులు వసూలుచేసే వారు, సైన్యం, పట్టణాలలోవుండే స్త్రీలలో ఎక్కువమంది, ఇంకా ఎందరెందరో ఇతరులమీద ఆధారపడి జీవిస్తూన్నారు. సరుకుల నుత్పత్తి చెయ్యడంలో వారు ఏమాత్రమూ పాల్గొనడంలేదు. ధనిక సమాజంలోని నైతికపతనాన్ని ఫొరియరు బాగా బయటపెట్టేడు. వివాహం అనే సంస్థలోని మోసాన్నీ, కుటుంబపద్ధతి శిధిలం అయిపోతూన్న విషయాన్నీ వివరించేడు. పట్టణాలకీ - పల్లెలకీ మధ్య భేదాలు నశించాలన్నారు, ఫొరియరు - ఓవెనులు. వస్తూత్పత్తిశక్తికీ - విజ్ఞానానికీ సంబంధం ఏర్పరచగల విద్యకావాలని ప్రచారంచేసేరు. (ఓవెన్ అభిప్రాయాలని మరో పుస్తకంలో వ్రాస్తాము.) సెంట్ సైమన్ అద్భుత మేధావంతుడని ఏంజిల్సు వ్రాసేడు. ఈ సెంట్ సైమన్ రాజకీయసమస్యలకి మూలాధారం ఆర్థికవ్యవహారాలేనని చూచాయగా గ్రహించేడు. ఈనాడు మానవ సమాజం మీద అధికారం చలాయించుతూన్న రాజ్యాంగయంత్రం ఒకప్పుడు ఉత్పత్తివిధానాన్నీ - వినిమయ పద్ధతినీ నడిపించే నిర్వహణ సంస్థగా మారవలసి యుంటుందనే విషయం-అంటే రాజ్యాంగయంత్రం రద్దు అవుతుందని ఆతడు వ్రాసేడు.

ఆధునికసమాజాన్ని లేశలేశాలుతీసి విమర్శించడంలో ఉటోపిస్టులు ఘట్టివాళ్ళే ; కాని, వారు భవిష్యత్తులో సమాజం ఏలావుండాలో చేసిన నిర్ణయాలు మాత్రం వట్టి గాలిమేడలు. ఆర్థికప్రమాణక్రమాలని జాగ్రత్తగా సరిశీలించి నిర్ణయించినవికావు అవి. కానయితే, భవిష్యత్తులో సమాజం ఏలాఏలాగ వుండాలో చిన్నచిన్న వివరాలతోసహా తయారు

చేసేరు. ఫౌరియరు 'ఫాలాంస్టరీ సమాజం' అంటూ ఒక ప్రణాళిక తయారు చేసేడు. 'ఫాలాంక్సు' అంటే సైనికవ్యూహం. దానిని పట్టి ఈ పేరు కల్పించేడు. ఫాలంస్టరీ అంటే ఒక 'సెటిల్మెంటు'. ప్రతి సెటిల్మెంటులోనూ 1600—1800 మంది ప్రజలకి మించి వుండకూడదన్నాడు. ఫాలంస్టరీ సభ్యులంతా వంతుల ప్రకారం అన్నిరకాల వ్యవసాయ - పరిశ్రమ శాఖలలోనూ కొద్దికాలం పనిచేసి తీరాలి. ఫౌరియరుకు పెట్టుబడిదారీ విధానం పోవాలనే అభిప్రాయమేనాలేదు. ఫాలాంస్టరీ ఉత్పత్తిచేసిన సరుకును సభ్యులంతా పంచుకోవాలి. ఉత్పత్తిలో పన్నెండింట అయిదుభాగాలు శ్రామికులకి; నాలుగు భాగాలు పెట్టుబడిదారులకి; మూడు భాగాలు కార్యనిర్వాహకోద్యోగులూ తీసుకోవాలని వ్రాసేడు. దీనివలన ఉత్పత్తి సాధనాలు సంఘంపరం చెయ్యాలనే భావమే ఆతనికి లేదన్నమాట స్పష్టము. శ్రామికులకి పెద్దభాగం ఇవ్వడంవలన; పోటీ చెయ్యాలనే భావం కలిగించడం—దానిని అదుపులో వుంచడంద్వారానూ; వృత్తుల మార్పువలన; అందరియొక్క కేంద్రీకృతశక్తివలన శ్రామికుల వస్తూత్పత్తిశక్తి ఎక్కువ కాగలదని ఆతనిపూహ. ఈవిధమయిన పునాదులమీద ఏర్పరచబడిన సమాజంలో జీవిత విధానము, మానవజాతి యొక్క ఆయుస్సు, శక్తి పూర్తిగా మార్పుచెందుతాయని భావించేడు. ఈ మార్పుల్నికూడా ఫౌరియరు ఏవో కలలుగానే చిత్రించేడు.

## ఉటోపిస్టుల ఎత్తుగడలు.

పెట్టుబడిదారీవిధానంయెక్క అభివృద్ధిమూలకంగా ఏర్పడిన పరిస్థితులు చాలా దుర్భరంగావున్నాయని ఉటోపిస్టులు నిర్ణయించేరు, కాని, ఆపరిస్థితుల్ని చక్కపరచడం బహుసులభమైన పనియని వారిపూహ.

తమరు తలుస్తూన్న భవిష్యత్సమాజస్వరూపాన్ని గూర్చి బ్రహ్మాండంగా ప్రచారంచేసే స్తేచాలును, ప్రపంచం మారిపోతుందని వారి ఉద్దేశ్యం. ఆవుద్దేశ్యంతోనే ధనికులకీ, అధికారులకీ, వినతిపత్రాలు ప్రకటించి, భవిష్యత్సమాజనిర్మాణానికి ఆదర్శం చూపేటందుకై ఆశ్రమ కేంద్రాలనిర్మాణానికి ధన సహాయం ఇమ్మని ప్రార్థించేరు. ఏ ధనికుడో - ఏ రాజో ధనం ఇస్తాడనీ, దానితో తాము తలచుతూన్న విధానంలో ఒక ఆశ్రమం నడపవచ్చుననీ, దానిని చూసి మానవలోకం అంతా సంతృప్తిపడి ఆ మార్గాన నడిచిపోగలదనీ వారి వూహ. విప్లవంగాని, రాజకీయపోరాటం గాని అవసరమేలేదని వారి నమ్మకం. "నాపిడికిట్లో విప్లవంఅనే వస్తువు వుండటం తటస్థిస్తే, ఆపిడికిలి నేనెన్నిటికీ తెరవను" అని ప్రకటించేడు. ఫ్రెంచి సోషలిస్టుకాబెట్ (1788-1856). 1848 విప్లవానికి కొద్ది నెలల ముందు ఈతడే ఫ్రెంచి శ్రామికులకి "అమెరికా వెళ్ళి, సోషలిస్టువలసలు ఏర్పరచుకు బ్రదకండి" అని సలహా యిచ్చేడు. ఒకఆంగ్లేయ సోషలిస్టు- "దౌర్జన్యం జరగకుండా చూసుకోవడం అన్నిటికంటేనూ ముఖ్యం" అన్నాడు. "కాలం వచ్చిందంటే, కత్తి దుయ్యవలసిన పనికాదుగదా, వేలు కదపవలసినపనికూడా వుండదు.

ఈ సమాజంలోకల్లా ఎక్కువగా పీడించబడేవర్గం శ్రామికులేనని ఉటోపిస్టులు ఒప్పుకుంటారు. కాని, స్వతంత్రకార్యాచరణకు తగిన శక్తి వారికి లేదంటారు. వారికి పైవర్గాలవారి సహాయం కావాలి. అధికారంలో వున్న వర్గంవారి ఔదార్యంమీద ఆధారపడి వుంటారు. అయితే—"ధనికుల్ని మొట్టమొదట సరియైన బాటలో పెట్టకపోతే ఏలాగ?"—అని ప్రశ్నవచ్చింది. లేకపోతే వారు శ్రామికుల సహాయానికి రారుగదా? దానికి సమాధానంగా 'కాబెట్టు'—"నిజమే. ముందువారివద్దనుంచే మన

ప్రచారం ప్రారంభించాలి. అది ఉపయోగకరమేకూడా. విద్యావంతులకీ-ధనికులకీ, ధనవంతులమీదా - బీదలమీదాకూడా మంచి పలుకుబడి వుంటుంది. అయితే మనం ధనికులలో ప్రచారం చేసి విజయం పొందగలమా? యని ప్రశ్నించవచ్చును. ఏమీ సందేహపడనక్కరలేదు. ఆధనికులలో ఉదారులు లేరా? బుద్ధిమంతులులేరా?"—అనేసేడు. ఫోరియరు తాను ప్రకటించిన "ఫాలాంస్టరీ" ల స్థాపనకి ధనం ఇవ్వవలసిందనీ, అల్లాగ ఇవ్వదలచినవారు ఫలానా కాలంలో ఏరోజునయినా తనని ఇంటి వద్ద కలుసుకోవచ్చుననీ, ప్రకటించి, ఏ కోటీశ్వరుడైనా తనకి డబ్బు ఇవ్వడానికి వచ్చి వెళ్లిపోతాడేమోనని ఆగంటలలో ప్రతిరోజూ చాలా కాలంవరకూ కనిపెట్టుకుని కూర్చుంటూ వచ్చేడని చెప్పుతారు.

పేరు పడిన ఉటోపిస్టులందరూ దయాపరులయిన ధనికుల యొక్క, ఔచిత్యం ఎరిగిన ప్రభువులయొక్క, సహాయంతో సోషలిస్టు వలసలు సృష్టించాలనే ప్రయత్నంలో వుండేవారు. కొందరు మధ్యతరగతులతో ఎక్కువ సన్నిహితసంబంధాలు కలిగివుండి, వారి భావాలూ, కోరికలతో ఒక కార్యక్రమాన్ని తయారుచేసేరు. ప్రౌధన్ (1809—1865); లూయీ బ్లాంకులు (1811–1882) ఈ తరగతివారే. మ్యూచుయల్ క్రెడిట్ (అప్పులిచ్చే) సంస్థలు సహకార సంఘాలు ఏర్పడితే చాలునని వీరి అభిప్రాయం. తక్కువ వడ్డీకి అప్పు దొరికితేనూ, సహకార పద్ధతులమీద సరుకు విడుదల అవుతేనూ, చిన్నచిన్న ఉత్పత్తిదారులపని నడిచిపోతుంది. ఈ బ్యాంకులు, షాహుకార్లూవిధించే వడ్డీలకి వారు తాళలేరు. ఈ సోషలిష్టులుకూడా ప్రత్యేకాస్తి పద్ధతి రద్దుకావాలని చెప్పరు. పైగా చిన్నచిన్న ఆస్తిపరులని పైకి తీసుకురావాలని ప్రయత్నిస్తారు. 1840 ప్రాంతాలలో మధ్యతరగతుల్నీ-శ్రామికవర్గాన్నీ ఆకర్షిస్తూన్న సోషలిస్టుల ప్రధానాశయాలు ఇవి.

1840 నాటికి ఫ్రెంచి సోషలిస్టులలోకల్లా మంచి పలుకుబడికల వారిలో లూయీ బ్లాంకు ఒకడు. ఉటోపిస్టులందరి మాదిరిగానే బ్లాంకు కూడా విప్లవాన్నీ - బలప్రయోగాన్నీ నిరసించేడు. ఉత్పత్తిదారులు సహకార సంఘాలు నిర్మించుకుంటే చాలునని అతని నమ్మకం. "హింసా విధానంతోగాక, శాంతియుతంగానే ప్రజాసామాన్యం స్వాతంత్ర్యం సంపాదించుకోగోరుతుంది. అహింసాయుతపద్ధతులు మన శత్రువులకే వదిలివేద్దాం" ఇదీ బ్లాంకు ధోరణి. సమాజం అంతా - ఆఖరుకి ధనిక వర్గంకూడా సోషలిజం స్థాపించడానికి ఇష్టపడతారని అంటాడు. "ధనికులకి సత్కార్యాచరణయందు సానుభూతి కలిగిస్తే, దేశంయొక్క అభివృద్ధికి వారు తమ సర్వశక్తులూ వినియోగిస్తారు. వారిని ప్రజలతో కలిసిపోయీలాగ చేద్దాం. పరస్పరపోటీపద్ధతిని - సహకారపద్ధతిగా మార్చేటందుకు అవకాశం కలిగించుదాం."

సహకార సమాజం ఏర్పడేలోపుగా ప్రజాతంత్ర ప్రభుత్వం ఏర్పడడం అవసరం అంటాడు లూయీ బ్లాంకు. ఈనాటి సంస్కారవాదులది కూడా అదే అభిప్రాయం. ఉటోపిస్టులలో మొదటి తరంవారు రాజ్యాంగం అవసరమనే విషయాన్నే ఒప్పుకోలేదు. లూయీ బ్లాంకు సోషలిష్టు సమాజం ఏర్పడడానికి రాజ్యాంగం యొక్క సహాయం అవసరమని గుర్తించేడు. ఆరాజ్యాంగం మనస్వాధీనం చేసుకోవడానికి వోటు హక్కు అవసరం అన్నాడు. వోటు హక్కుతో ప్రజలకి రాజ్యాంగంలో పలుకుబడి వస్తుందనీ; దాని సహాయంతో సహకారసంఘాలు స్థాపించి, ప్రజోపయోగకార్యాలు చేయవచ్చుననీ; వ్యక్తుల చేతులలో వున్న ధనాన్ని ఆప్రజోపయోగ సంస్థలు నడపడానికి ఉపయోగించవచ్చుననీ అతని వూహ. బలవంతంగా వ్యక్తుల అధికారంలోవున్న సంస్థల్ని

మూయించనక్కరలేదు. ప్రజాసంస్థలతోడి పోటీలో అవే మూసుకు పోతాయి. ఇవీ బ్లాంకు అభిప్రాయాలు,

ఆరోజులలో ఫ్రాన్సులో "ఉత్పత్తిదారుల సహకారసంఘాల" ఉద్యమం మంచి వ్యాపకంలోవుంది. కాని, విశేషోత్పత్తి చెయ్యగల పెద్ద కర్మాగారాలతోడి పోటీలో వానిలో చాలవరకు దివాలాలు తీసేయి. మిగిలినవి పోటీలో నిలువబడడానికి శ్రామికవర్గాన్నే దోచడం ఆరంభించి నాయి.

## ఉటోపియానుంచి శాస్త్రీయసిద్ధాంతం

చారిత్రకపరిణామంలో సోషలిజం అనేది ఒక ఘట్టం. అత్యవసరమైన ఘట్టమేకూడా. ఒక ప్రత్యేకావస్థలో పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం స్థానే సోషలిస్టు ఉత్పత్తివిధానం ప్రవేశపెట్టి తీరవలసిన అవసరం ఏర్పడుతుంది - ఇవీ శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతాల్ని కనిపెట్టిన మార్క్సు, ఏంజిల్సులు చెప్పినమాటలు. వీరు తత్వశాస్త్రాన్నీ, అర్థశాస్త్ర సిద్ధాంతాలనీ ; ఆనాటి ఆర్థిక - రాజకీయచరిత్రలనీ, ఎంతో విమర్శతో, జాగ్రత్తగా పరిశీలించి, చారిత్రక భౌతికవాద సిద్ధాంతాన్ని తయారు చేసేరు. మానవసమాజంయొక్క అభివృద్ధికిగల రహస్యసూత్రాన్ని వారు బయటపెట్టేరు. ప్రపంచాన్నీ, చరిత్రనీ, శాస్త్రీయంగా నిర్వచించి సిద్ధాంతీకరించడాన్నే గతితార్కిక భౌతికవాదం అంటారు. ఇది చరిత్రయొక్క గతివిధానాన్ని అర్థం చేసుకుందుకు సావకాశాలు కలిగించి, శ్రామికవర్గ కలహానికి సరియైన ఎత్తుగడలూ - మార్గాలూ సూచిస్తూంది.

మార్క్సుకిపూర్వం ఉటోపిస్టుల ఆశలన్నీ ప్రభువుల ఉదారత్వం మీదా; తమ ఆదర్శాల గొప్పతనంమీదా ఆధారపడివుండేవి. కాని,

మార్క్సుధోరణేవేరు. అసలు పెట్టుబడిదారీవిధానం ఏలా బయిలుదేరి, అభివృద్ధికి వచ్చిందో వివరించేడు. ఆ అభివృద్ధే క్రమంగా ఉత్పత్తి సాధనాలని సంఘపరంచేసితీరవలసిన అవసరాలనీ, అవకాశాలనీ కలిగిస్తుందని చెప్పేడు. ఒక ప్రత్యేకమైన దశకు వచ్చేక ఉత్పత్తివిధానం అభివృద్ధిపొందాలంటే ప్రత్యేకాస్తి పద్ధతి రద్దు అయితీరాలని నిరూపించేడు. శ్రామికవర్గానికి సోషలిజంయొక్క నిర్మాణంలో ప్రాధాన్యతయే లేదంటారు ఉటోపిస్టులు. సోషలిజం ఏర్పడడానికి ప్రధానమైన కార్య విధానం ఉత్పత్తిసాధనాలమీద వ్యక్తుల అధికారం రద్దుచేయడమేననీ, ఆపనిచెయ్యగలది ఒక్క శ్రామికవర్గమేననీ మార్క్సు - ఏంజిల్సులు చెప్పుతూన్నారు. ధనికవర్గాన్ని కూలద్రోసి శ్రామికవర్గం రాజ్యాంగాధికారాన్ని గుంజుకోవాలనీ, ఆనాడే సోషలిజం స్థాపించడానికి అవకాశాలు కలుగుతాయనీ వారి వూహ. అందుచేతనే విప్లవరంగంలో సహాయం చేయడానికై శ్రామికవర్గాన్ని రాజకీయపోరాటంలోకి ఆకర్షించితీరాలని వారి నిర్ణయం.

## కమ్యూనిస్టు లీగు : కమ్యూనిస్టు మానిఫెస్టో.

మార్క్సు - ఏంజిల్సులు 1845 ప్రాంతాలనాటికి తమ అభిప్రాయాలకి ఒక స్వరూపం ఇచ్చేరు. వారు వట్టి సిద్ధాంతవేత్తలుమాత్రమే కాదు. గొప్పనిర్మాణచాతుర్యం గలవారూ; శ్రామికవర్గోద్యమంలో స్వయంగా పాల్గొన్నవారూ కూడాను.

1834 లో జర్మను కూలీలూ, రాజకీయ ప్రవాసితులూ కొందరు పారిస్‌లో 'ప్రవాసుల సంఘం' అంటూ ఒక సంఘాన్ని స్థాపించేరు. 1836 నాటికిది 'లీగ్ ఆఫ్ ది జస్టు'గా మారింది. ఇదే కమ్యూనిస్టు విప్లవ

కారుల రహస్యసంఘం. 1840 లో ఈ సంఘంయొక్క ప్రధానకార్యాలయం లండనుకు మార్చబడింది. 1847 లో మార్క్స్ - ఏంజిల్సులు ఈ సంఘంలోచేరి, దానిపేరు 'కమ్యూనిస్టు లీగు' అని మార్పించేరు. వారే 1848 లో ఈ లీగుకి ఒక కార్యప్రణాళికను తయారుచేసేరు. అదే ప్రపంచ విఖ్యాతమైన కమ్యూనిస్టు మానిఫెస్టో. ఈ లీగు తన కార్యక్రమం పూర్తిగా శాస్త్రీయ సోషలిజాన్ని అనుసరించేవుంటుందని మానిఫెస్టోలో ప్రకటించింది. 1846 నాటికే మార్క్స్, వీట్లింగ్ (1808-71) తోగల సంబంధాలు వొదులుకున్నాడు. వీట్లింగ్, ధార్మికసంఘంతాలూకు ప్రచారకుడూ, వ్రాయసకాడూను. ఆతని సోషలిజంఅంతా భావావేశంలో పుట్టినదే. ఇతడు తీవ్రవాదులయిన జర్మన్ కూలీల వర్గప్రతినిధి. జైళ్ళలో పడివున్న యిరవై వేలమంది దొంగల్నీ - బికారీలనీ విడుదలచేసి, వారి సహాయంతో సోషలిజం స్థాపించవచ్చునని ఆశించేవాడు. క్రీస్తు జీవితము, ప్రవచనాల (బోధన) నుంచీ ఉదాహరణలతో నిండివుంటుంది, ఆతని సోషలిజం. మార్క్స్-ఏంజిల్సులు "జర్మన్ సోషలిస్టుల" అభిప్రాయాల్ని కూడా తీవ్రంగా ఖండించేరు. ఈ జర్మన్ సోషలిస్టులు తమరిని 'నిజమైన' సోషలిస్టులని చెప్పుకుంటారు. వీరు— 'నిజమైన అవసరాలకోసం' పోరాడడానికి బదులు 'నిజంయొక్క అవసరాల్ని' గురించి పోరాడుతారు. శ్రామికుని హక్కులకోసం పోరాడటానికి బదులు ఏ వర్గానికీ చెందని ఆదర్శమానవుల ఉత్తమలక్షణాలకోసం పోరాడుతారు. ఫ్రాన్సులో సోషలిజంకోసంబీదశ్రామికులుపోరాడుతూన్నారు. జర్మనీలో "ముఖ్యంగా ఉన్నత తరగతులవారూ - విద్యావంతులూ" ఈ గమ్యాన్ని సాధించడానికి పూనుకున్నారు. కనుక శ్రామికులు రాజకీయపోరాటాలలో ప్రవేశించవద్దని హితబోధ చేసేరు. మార్క్స్ - ఏంజిల్సులు ఈ జర్మను

తత్వశాస్త్రపండితుల్నీ, తత్వశాస్త్ర విద్యార్థుల్నీ, విద్యావంతుల్నీ ముందు వొదుల్చుకొని; ఎక్కడెక్కడున్న విప్లవకర శ్రామికవర్గంతోటీ (బ్రసెల్సు-పారిస్ మొ॥ చోట్లలోని) పరిచయాలు ఏర్పరచుకొని కమ్యూనిస్టు కరస్పాండెన్సు శాఖ ఏర్పాటుచేసేరు. 1847 లో మార్క్సు-ఏంజిల్సులు కమ్యూనిస్టు లీగుకి సిద్ధాంతప్రదర్శకులయ్యేరు. ప్రపంచంలోని రాజకీయ సాహిత్యంలోకల్లా వజ్రపుతునక అనదగిన కమ్యూనిష్టు మానిఫెస్టో యొక్క ప్రధానాశయం ఇది.

"సాంఘిక జీవితనిర్మాణం ఉత్పత్తివిధానంలోనే పుడుతుంది. ప్రతి చారిత్రక ఘట్టంలోనూ, ఆయాసమయాల రాజకీయ - వైజ్ఞానిక చరిత్రలకికూడా మూలం ఉత్పత్తివిధానమే. అంటే మానవచరిత్ర యావత్తూ వర్గకలహాల చరిత్రే. దోపిడీచేసేవారు - చేయబడేవారు - పాలింపబడేవారు-వారి మధ్య, సాంఘికపరిణామముయొక్క వేరువేరు ఘట్టాలలో జరిగే నిరంతరాయమైన పోరాటాలచరిత్రే! ఒక్కమాటే, శాశ్వతంగా, ఈదోపిడీ - బాధ - వర్గకలహములతో కూడుకున్న సమాజాన్ని రద్దుచేసేస్తేగాని పీడిత - బాధితవర్గాలు (ప్రొలిటేరియటు) పీడక-పాలకవర్గాల (బూర్జువా) చేతులనుంచి స్వాతంత్ర్యం సంపాదించుకోలేని పరిస్థితులలోకి ఆపోరాటం పరిణమించింది."

(మానిఫెస్టోయొక్క 1888 ప్రచురణకి ఏంజిల్సువ్రాసిన పీఠికలో)

ఉటోపియను సోషలిజం స్థానే శ్రామికవర్గకమ్యూనిజం వచ్చింది. కమ్యూనిజానికి వర్గకలహంతోటీ, శ్రామికవర్గ నిర్మాణంతోటీ ఎడతెగని సంబంధం వుంది.

"ప్రపంచముయొక్క నూతన దృక్పథాన్నీ, సాంఘికజీవితానికి కూడా సరిపోయే భౌతికవాద సిద్ధాంతాలనీ, అభివృద్ధిగతిని నిరూపించే

గంభీరము - సర్వతోముఖమునైన గతి తార్కిక భౌతికవాద సిద్ధాంతాన్నీ, వర్గకలహవిధానాన్నీ, నూతనకమ్యూనిస్టు సమాజనిర్మాణం జరపగల శ్రామికవర్గానికి ప్రపంచచరిత్రలోగల విప్లవకరప్రాముఖ్యతనీ; నిస్పష్టంగా, వివరంగా, ఈ గ్రంధం నిరూపిస్తూంది."

లెనిన్—'కారల్ మార్క్సు' నుండి.

మధ్యతరగతికి చెందిన బ్రిటిషు ఫేబియను సోషలిస్టులు; వారి సిద్ధాంతాల ననుసరించి నడిచే బ్రిటిషు లేబరుపార్టీ - ఇండిపెండెంటు లేబరుపార్టీలూ; మొదటినుంచీ మార్క్సురచనలకీ, కమ్యూనిస్టు మానిఫెస్టోకీ పెడర్థాలు తీస్తూనే వచ్చేరు. వారి వుద్దేశ్యంలో ఈసిద్ధాంతాలన్నీ పాతబడిపోయినాయి. కాని వారు అనుసరించే అభిప్రాయాలూ, కార్యక్రమమూకూడా మార్క్సుకంటెనూపురాతనములయిన లూయీ బ్లాంకువి! 'ప్రజాతంత్రం'—'రాజ్యాంగయంత్రం'—పేరిట లూయీ బ్లాంకు 1871 నాటి పారిస్ కమ్యూన్‌ను నిందించి, ద్రోహంచేసి, శతృవులకి సహాయం చేసిన మాదిరిగానే ఫేబియనులూ, మాక్డొనాల్డు (లేబరుపార్టీ) గ్రూపువారూ, 1917 నాటి రష్యా విప్లవాన్ని నిందించి, నీచపరచి, రహస్యంగానూ, బహిరంగంగానూ కూడా వారి శతృవులకి పూర్తిసహాయం చేసేరు.

మార్క్సిస్టు విధానంతోపాటు, జర్మను సోషల్‌డెమాక్రసీనికూడా బ్రిటిషు సోషలిస్టులు ఒకప్పుడు తెగతిట్టి పోసేవారు. ఆజర్మను సోషలు డెమాక్రసీతో నేడు పూర్తిగా బ్రిటిషు సోషలిస్టులు ఏకీభవిస్తూన్నారు. 1848—50 లలో మార్క్సు - ఏంజిల్సు లవలంబించిన విధానం పేరు చెప్పేటప్పటికే వారు వణికిపోయే స్థితికి వచ్చేరు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని సోషలిస్టుపార్టీ 1914 ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధానికి పూర్వం మార్క్సిస్టు దృక్పథంతోనే వుండేది. యుద్ధం నాటినుంచీ అది, రివరెండ్ నార్మన్ థామస్ నాయకత్వాన బ్రిటిషు - జర్మను లేబరుపార్టీల తల తన్నివేసింది.

1848 నాటికి మానిఫెస్టోలోని అభిప్రాయాలు బాగా వ్యాప్తిచెందలేదు. పారిసులో తిరుగుబాటువచ్చిన సమయంలోనే మానిఫెస్టో ప్రకటించబడింది. పారిస్ తిరుగుబాటుతో యూరపులో ఒక మహావిప్లవ తరంగం రేగింది. ఆ 'విప్లవసంవత్సరం' లో అన్నిచోట్లా శ్రామికవర్గం ప్రాధాన్యత వహించి పోరాడింది. ఆ పోరాటంలోనే, ఆ అపజయాలలోనే, ఆనాటి నాయకులు చేసిన పొరపాటు ఎత్తులలోనే, భవిష్యత్తులో రాబోయే ప్రజోద్యమాలలో తాను అవలంబించవలసిన ఎత్తుగడలు, వానిలో తాను తీసుకోవలసిన ప్రాధాన్యతనీ శ్రామికవర్గం తెలుసుకుంది. విప్లవోద్యమానికి దారితీసిన ఫ్రాన్సులో కూలీలకి నాయకత్వం వహించినది లూయీ బ్లాంకు వంటి పెట్టీబూర్జువా సోషలిస్టులే.

## అగస్టీ బ్లాంక్వీ (1805–1881) బ్లాంక్విజం

అగస్టీబ్లాంక్వీతో ఉటోపియను సోషలిస్టులలో తీవ్రవాదభావాలు ఆరంభం అయినాయని చెప్పవచ్చును. ఈతడు విప్లవవాది. కమ్యూనిస్టు. తన జీవితంలో అధికభాగం - అంటే 36 ఏళ్ళపాటు జైళ్ళలోనే గడిపివేసేడు. పెట్టుబడిదారుల్ని విమర్శించడంలోకాదు అతని గొప్పదనం వుంటు ఆ విషయంలోనే అయితే ఉటోపిస్టులే అతనిని మించిపోయేరు. అతనికి విప్లవపు ఎత్తుగడలు బాగాతెలుసు. విప్లవంలో నమ్మకంగలవాడు, భవిష్యత్సమాజ నిర్మాణాన్నిగూర్చి ఇప్పుడే ప్లానులు వెయ్య

డాన్ని ఆతడు ఎదుర్కొన్నారు. శాంతిపద్ధతులమీద సోషలిజం వస్తుందనే భ్రమని ఆతడు నిరసించేడు. పెట్టుబడిదారీవిధానం వుండగానే సహకారసంఘ విధానం అధికారం వహించగలదనేది వట్టి భ్రమయని పోరాడేడు. రాజకీయపోరాటానికీ - సోషలిజానికీ విడతీయరానంత సమీప సంబంధం వుందనే అభిప్రాయం వ్యాపింపచేసి ఆతడు విప్లవోద్యమానికి మహత్తరసేవ చేసేడు. సాయుధ విప్లవంద్వారాను, తాత్కాలికంగా నియంతృత్వం స్థాపించడంద్వారానూ మాత్రమే సోషలిజం రాగలదని ఆతడు చాటి చెప్పేడు. బ్లాంక్వీ తనజీవితాన్ని అంతనీ సాయుధ విప్లవం తీసుకురావడం కోసమే పూర్తిగా వినియోగించేడు. సంఖ్య తక్కువగానే వున్నా మంచి క్రమశిక్షణ కలిగియున్న రహస్య విప్లవసంఘం ఒకటి సాయుధ తిరుగుబాటు లేవదియ్యడానికి అత్యవసరం అని ఆతని అభిప్రాయం.

జూలై 'సామ్రాజ్య' కాలంలోనే బ్లాంక్వీ ఈమాదిరి సంఘాన్ని నిర్మించడం ఆరంభించేడు. రెండవ సామ్రాజ్యకాలం అంతా ఈకార్యక్రమం సాగించేడు. పదేసిమందితో ప్రాథమిక సంఘాలు ఏర్పడుతాయి. ఆసంఘాల పెద్దలకి మాత్రమే జిల్లాసంఘంతో సంబంధం. బ్లాంక్వీ, మరి కొద్దిమంది సభ్యులూ కార్యకారిణీ సమితిగా ఏర్పడి జిల్లాసంఘాలతో సంబంధాలు వుంచుకుంటారు.

సాయుధ తిరుగుబాటుయొక్క అవసరాన్ని గుర్తించడం; తిరుగుబాటుకు ప్రయత్నించడం; విప్లవమే జీవితకృషిగా గలవారిని కొందరిని ఏరడం; వీటిమూలంగా ఉటోపియను సోషలిజానికీ - విప్లవకరసోషలిజానికీ మధ్య అవస్థనుగా బ్లాంక్విజాన్ని చెప్పవచ్చు. విప్లవకర సోషలిజానికి సిద్ధాంతకారులయిన మార్క్సు - లెనినులు బ్లాంక్వీనుంచి ఎన్నో

విషయాలు నేర్చుకున్నారు. కాని, బ్లాంక్వీ - ఆతని అనుచరులూ కూడా ప్రజాతంత్రానికి అనవసరమయిన ప్రాముఖ్యతఇచ్చేరు. అంతేగాక అంతర్జాతీయ విప్లవోద్యమంలో ఫ్రెంచి శ్రామికులకి అధిక ప్రాముఖ్యత నిచ్చేరు. తత్ఫలితంగా, బ్లాంక్వీ 'మాతృభూమిని రక్షించాలి' అనే ధోరణికి వచ్చి, జర్మనులకి వ్యతిరేకంగా కరడుగట్టిన సంకుచిత జాతీయతలోకి జారిపోయేడు.

బ్లాంక్వీని అందరిమాదిరిగానే కుట్రదారుడనీ, ఆక్రమణకారుడనీ తలవడం పొరపాటు. అతనిలో లోపం ఒక్కటే. పార్టీకి. వర్గానికీ వుండ వలసిన సంబంధాన్ని అతను గుర్తించలేదు. బ్లాంక్విజం విప్లవోద్యమంలో ఒక్క అడుగు ముందుకువేసి, కార్మిక విప్లవానికి నాయకత్వాన్ని స్వీకరించింది - బ్లాంక్వీయెడలా, ఆతని అనుచరులయెడలా మార్క్సుకి మంచి అభిప్రాయం వుంది. 1850 లో మార్క్సు - ఏంజిల్సులు బ్లాంక్విస్టులతో ఒక నామమాత్రపు స్నేహం కుదుర్చుకున్నారు. ఆసమయంలో బ్లాంక్వీ జైలులో వున్నాడు. విప్లకర కమ్యూనిస్టుల అంతర్జాతీయ సంఘం ఏర్పరచడానికై చేయబడిన ప్రకటనలో మార్క్సు - ఏంజిల్సూ; ముఖ్యులయిన బ్లాంక్విస్టులూ సంతకాలు పెట్టేరు.

## ప్రశ్నలు.

1. ఉటోపియను సోషలిజానికీ, శాస్త్రీయ సోషలిజానికీ గల భేదాలు ఏమిటి ?
2. పై రెండింటికీ బ్లాంక్విజం మధ్యమెట్టు అనడంలో ఉద్దేశంఏమిటి ?
3. ఫొరియరు భావాలు సామాజిక సమస్యల్ని సాధించలేవని ఏలాగ నిరూపించగలం ?

# 1848 ఫ్రాన్సు విప్లవం.

1789 మొదలు 1794 వరకు జరిగిన ఫ్రెంచి మహావిప్లవంతో ఫ్రాన్సులో (బూర్జువా డెమాక్రటిక్) ప్రజాతంత్ర విప్లవం పూర్తికాలేదు. 1794 థెర్మిడార్ మాసంలో 9 వ తేదీన రైతు నియంతృత్వం తన అతి వాద ప్రజాతంత్రవిధానాన్ని వదులుకుంది. పట్టణవాసులయిన మధ్య తరగతీ, శ్రామికవర్గమూకూడా బాగా అలిసిపోయింది. జాకోబినులు 5 గురితో ఏర్పడిన "డైరెక్టరీ"ని త్రోసివేసి 1799 లో "కాన్సలేటు" ప్రభుత్వాన్ని తీసుకుంది. మొట్టమొదటి కాన్సలు నెపోలియను బోనపార్టీ, ఒకప్పుడు జాకోబినుపార్టీవాడు. విప్లవసేనలలో మంచి ప్రఖ్యాతిపొందిన సేనాధిపతి. ఈతడు. 1804 లో తనను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు. దీనినే "మొదటి సామాజ్యం" అంటారు. ఈ ప్రభుత్వం కాలంలో రాజ్యాంగంలో నిర్ణయాలన్నీ పెద్దపెట్టుబడిదారుల ఇష్టానుసారంగా వుండేవి. విప్లవసమయంలో రైతాంగానికి లభించిన హక్కులు మూలబడ్డాయి. కాని, కొద్దికాలంలోనే యూరోపులోని జమీందారీ ప్రభుత్వాలన్నీ ఏకం అయి నెపోలియనుని ఓడించేయి. ప్రజలు తరిమివేసిన పూర్వపు బోర్బన్ రాజకుటుంబం మళ్ళీ గద్దె ఎక్కింది. విప్లవంలో దేశం వదలి పారిపోయిన రాజబంధువులంతా తిరిగివచ్చి తమ పూర్వపు సౌకర్యాలన్నీ మళ్ళా గుంజుకోవాలని ప్రయత్నించేరు. ప్రజల స్వాధీనం అయిపోయిన వారి భూములకి ప్రతిఫలంగా లక్షలకొలది ఫ్రాంకులు నష్ట పరిహారాలు ఇయ్యబడినాయి. పూర్వపు పరిపాలనాపద్ధతి స్థాపించబడి నందుకు వారువిపరీతంగా సంతోషించేరు.

1830 జూలైలో పారిస్‌లో మరోవిప్లవం వచ్చింది. బోర్బన్ రాజకుటుంబం తరిమివేయబడింది కాని, ప్రజలు "రిపబ్లికు" స్థాపించు

కోలేకపోయేరు. "బోర్బను"ల స్థానంలో "ఆర్లియను" రాజకుటుంబం వచ్చింది. లూయీ ఫిలిప్, ఆర్లియన్సు డ్యూకుకొడుకు. ఈ డ్యూకు మహావిప్లవంలో పాల్గొన్నాడు. అప్పుడే తన పేరు "సమదర్శి" అని మార్చుకున్నాడు. తరువాత ఈయన ఉరిశిక్షపొందేడు. ఆ సమదర్శి కొడుకే లూయీ ఫిలిప్ రాజు. పెద్ద పెట్టుబడిదారుల, అధిక ధనవంతుల హక్కుల్ని సంరక్షించేవాడు. లూయీ ఫిలిప్ రాజుగా ప్రకటించబడి నప్పుడు "ఇకమీద ఫ్రాన్సుని పాలించేది బ్యాంకర్లే" నని 'లాఫిట్టే' ప్రకటించేడు.

పారిశ్రామిక విప్లవంతో ఇంగ్లండుయొక్క ఆర్థికవిధానం పూర్తిగా మారిపోయింది. దానితో పోల్చి చూస్తే, ఫ్రాన్సుని వ్యవసాయ ప్రధానమైన దేశమేనని చెప్పవచ్చు. ఆనాటికి ఇంగ్లాండు జనసంఖ్యలో రైతులు నూటికి 23 గురయితే ఫ్రాన్సులో 75 గురున్నారు.

మహావిప్లవానంతరం ఫ్రాన్సులో చిన్నచిన్న భూస్వాములసంఖ్య పెరిగింది. కాని, వీరికి పన్నులు అధికం. తన స్వశక్తిమీదనే ఆతడు ధన ప్రధానమైన ఈ ఆర్థికవిధానంలో అభివృద్ధికి రాలేడు. ఆతడు చెయ్యగలవల్లా రెండుపనులు; చల్లికల రోజుల్లో అప్పుతెచ్చి, కోతలలోతీర్చి, మళ్ళీ చల్లికలకి తెచ్చుకుంటూ ఈ విధంగా అప్పులు చేస్తూండడం; ఇతరుల భూములు కౌలుకి తీసికొని వ్యవసాయం పెంచడమూ; ఈరెండింటా కూడా ఆతనికి అప్పుచెయ్యడం తప్ప మారుగతిలేదు. అప్పు అంటే భూమి కుదువపెట్టడమేకదా! రైతు ప్రతి యేడాదీ అసలులో కొంతా, వడ్డీ పూర్తిగానూ ఇయ్యవలసివుంటుంది. 1840 ప్రాంతాల ఫ్రెంచి రైతాంగం ఏటేటా ఈసూదిరిగా 55కోట్ల ఫ్రాంకులు ఋణాలక్రింద చెల్లిపెడుతూ వచ్చింది. అంటే ఫ్రెంచిరైతుల మొత్తపుఆదాయంలో మూడో

వంతు ఋణాలక్రింద పోతూందన్నమాట. క్రమంగా రైతులు కుదువ పెట్టే భూముల వైశాల్యం పెరుగుతూంటుంది. ఫలితంగా ఋణదాతలు విశేష లాభాలు సంపాదించేరు. పల్లెటూళ్ళలో ప్రభుత్వం అంతా ఋణ దాతది. ఫ్రాన్సుని మొత్తంమీద పాలించేది బ్యాంకర్లు. భూముల తనఖాల వలన; క్రమంగా హెచ్చుతూండే ధరలలో భూములు కొనడం-అమ్మడం ద్వారానూ, ఎక్కువలాభాలు చేరుతాయి. ప్రభుత్వపు బడ్జెటు నష్టాలు బ్యాంకర్లకి లాభాలు తెచ్చియిచ్చే మార్గాలలో ఒకటి. దీర్ఘకాలపు యుద్ధాలు కారణంగా బడ్జటు సరిపడడం అనేదిలేకుండా పోయింది. చిన్నరైతాంగం జాస్తీగావున్న దేశంలో ఉద్యోగులు, అధికార్లసంఖ్య హెచ్చు. వారికోసం అయ్యే ఖర్చుతో ప్రభుత్వ ఋణభారం కూడా అధికం అవుతూంటుంది. ఈ నష్టాన్ని పూడ్చుకోవడానికి అప్పు పుచ్చు కోవడం ఒక్కటేమార్గం. ధనికులవద్ద హెచ్చురేట్లమీద ఋణాలు తెచ్చుకోవాలి. ఆవిధంగా ప్రభుత్వఋణాలు వడ్డీవ్యాపారుల ధనార్జనకి ప్రధానసాధనాలు అయినాయి. అదే మధ్యతరగతులతో విరోధం రావ డానికి సాధనం అయింది.

పెట్టుబడిదారీ వర్గంలో పారిశ్రామిక పెట్టుబడిదార్లకింకా ప్రాధా న్యత చిక్కలేదు. అయినా పారిశ్రామిక పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి పొందుతూనేవుంది. ఒక్క ఎనిమిదేళ్ళలో ఆవిరియంత్రాల సంఖ్య రెట్టింపు అయిపోయింది.

| | ఆవిరియంత్రాలు. | గుర్రాలశక్తి. |
|---|---|---|
| 1839 | 2,540 | 33,000 |
| 1847 | 4,583 | 62,000 |

అదేకాలంలో బొగ్గు వుత్పత్తి 1,80,000 టన్నుల నుంచి 50,00,000 టన్నులకి పెరిగింది. మొట్టమొదటి రైలుమార్గం వెయ్యబడింది. పెద్ద పెద్ద పరిశ్రమలు బాగా విజృంభించడం; యంత్రసామగ్రి విశేషంగా ఉపయోగంలోకి రావడం; పెద్ద పెద్ద ఉత్పత్తిదారులకి చిన్న వుత్పత్తిదారులు బానిసలు కావలసి రావడం; చిన్న చిన్న వర్తకుల్ని పెద్దవర్తకులు నాశనం చేసివెయ్యడం; (ఈ క్రమం ఇంకా పూర్తిగాక పోయినా) వీనివలన పట్టణనివాసులయిన మధ్యతరగతులలో అసంతృప్తి బాగా వ్యాపించింది.

పెట్టుబడిదారీవిధానం యొక్క అభివృద్ధితోపాటు శ్రామికులసంఖ్య కూడా పెరిగింది. వారిలో కొద్దిమందిమాత్రమే పెద్ద పెద్ద పరిశ్రమలలో పనిచేస్తూన్నారు. పెద్దవర్తకుల - ఉత్పత్తిదారుల పెట్టుబడులమీద నడుస్తూవుండే చిన్న పరిశ్రమలలో విశేషసంఖ్యాకులు పనిచేస్తూన్నారు. వీరు శ్రామికవర్గాన్ని అవకాశం చిక్కినంత అధికంగా దోచుకొనేవారు. వారిలో చాలమంది ఇళ్ళవద్దకూడా పనిచెయ్యవలసివుండేది. (పారిస్‌లో ఎక్కువ సంఖ్యలోవుండే కుట్టుపనివారూ, స్త్రీలూ ఈ తరగతికి చెందిన వారే.) ఒక్క పారిసునగరంలో కూలీలసంఖ్య 3 లక్షలు. వారిలో 70 వేలమంది గృహకృత్యంలోనూ, బట్టలకుట్టుపనిలోనూ పనిచేస్తూన్నారు. ఆనాటి కింకా యజమానికీ - కూలివానికీ మధ్య భేదం స్పష్టంకాలేదు. ఆ భేదం ఒక్క పెద్దపరిశ్రమలలో పనిచేసేవారికీ పెద్ద పెట్టుబడిదారులకీ మధ్య కనబడుతూంది. అధిక సంఖ్యాకులుగావున్న చిన్నవ్యాపారులు కూలీలయెడ ఒకవిధమైన ఆత్మీయత చూపించేవారు. ఇంక శ్రామికులు కూడా తమరూ ఏదో ఒకనాటికి స్వతంత్రంగా వ్యాపారం పెట్టుకోగలుగుతామనే ఆశిస్తూండేవారు. చిన్నవ్యాపారులూ - వారివద్ద పనిచేసే

వారూ ఈ కారణంచేత పెద్ద పెట్టుబడిదారులయెడ శతృత్వం వహించేరు. పారిస్‌లో ఆనాటికి 64,000 మంది వ్యాపారులుండేవారు. వారిలో సగంమందికి పైగా తా మొక్కరూనో, లేక ఒక్క మనిషి సహాయంతోనో వ్యాపారం చేసుకొనేవారే.

ఆవిధంగా క్రమంగా పెరుగుతూన్న సాంఘికవైరుధ్యాలు రాజకీయ పరిస్థితులు కారణంగా తీవ్రరూపం ధరించేయి. అప్పటికి ఫ్రెంచి దేశపు జనాభా రెండు కోట్ల నలభై లక్షలు. వారిలో 2,40,000 మందికి అంటే 1% పెద్దపెద్ద ధనికులకీ భూస్వాములకీ - మాత్రమే వోటు హక్కు వుండేది, రాజ్యాంగంలో తమకిగల సౌకర్యాలద్వారా రాజ్యాంగ యంత్రాన్ని ఉపయోగించుకొని వడ్డీవ్యాపార్లు ఇంకా ఇంకా డబ్బు కూడబెట్టుకుందుకు చేసే అకార్యాలమూలంగా ప్రజాసామాన్యంలో మరింత అసంతృప్తికలిగింది. పారిశ్రామిక పెట్టుబడిదార్లుకూడా కొంతవరకు ప్రభుత్వం యెడ విముఖులుగానే వున్నారు. వారు రాజరికం పోవాలనడం లేదు. వోటు హక్కు విషయంలో సంస్కరణమాత్రమే కోరుతూ చట్టబద్ధమైన ఆందోళన చేస్తూన్నారు.

1847—48 ల నాటికి ఆర్థికదుస్థితితో పరిస్థితులు విషమించేయి; ఈదుస్థితివలన ఫ్రెంచిదేశపు ఆర్థికస్థితి ఏలాగ తలక్రిందులయిపోయిందో తెలుసుకోవాలంటే ఆరెండేళ్ళలోనూ ఫ్రాన్సు విదేశీయవర్తకం, పారిసులోని వస్తూత్పత్తి ఎటువంటి మార్పుపొందినాయో చూస్తే తెలుస్తుంది.

| సం. | ఫ్రాన్సులోకి దిగుమతులు. (లక్షల ఫ్రాంకులలో) | పారిస్ పరిశ్రమల ఉత్పత్తి. |
|---|---|---|
| 1847 | 1,29,000 | 14,630 |
| 1848 | 7,080 | 6,770 |

పరిశ్రమలు ఇంత అధికంగా పడిపోవడంతోనే, నిరుద్యోగుల సంఖ్యకూడా విశేషంగా పెరిగిపోయింది. లక్ష ఎనభై వేలమంది కూలీలు తొలగించబడ్డారు. వర్గకలహం రూపం ధరించింది. వోటింగు హక్కుల సంస్కరణకోసం ఆరంభం అయిన ఆందోళన విప్లవానికి దారితీసింది. 1848 ఫిబ్రవరి 24 న లూయీ ఫిలిప్ ఫ్రాన్సువదిలి పారిపోయేడు. రాజరికం కూలద్రోయబడిందనే అనిపించింది.

## ఫిబ్రవరి విప్లవంయొక్క స్వభావము, శ్రామికుల ఎత్తుగడలు

దానికి గల కర్తవ్యాలనిపట్టి చూస్తే, బూర్జువా డెమాక్రటిక్ విప్లవాలలో 1848 విప్లవం ఒక అత్యవసరఘట్టం. దేశాన్ని పెట్టుబడిదారుల చేతుల్లోకి తీసుకురావడమూ; రాజరికంస్థానే రిపబ్లికు స్థాపించడమూ, బూర్జువా వర్గంలో ఎక్కువభాగానికి రాజకీయాధికారాలు కలిగించడమూ; ఆఖరికి అప్పుడప్పుడే జాతీయోద్యమాలు అభివృద్ధి పొందుతూన్న దేశాలలోని జమీందారీ రాజరికాలని కూలద్రోయగలిగేటట్లుగా ప్రోత్సాహం కలిగించడం; ఆ విప్లవం యొక్క కర్తవ్యాలు.

కాని, ఫిబ్రవరి విప్లవాన్ని సాగించినది శ్రామికవర్గం మాత్రమే. బూర్జువావర్గంపార్లమెంటులో ప్రాతికూల్యతవహించడంవరకే పనిచేసేరు. 1830 జూలైనాటి విప్లవంలో పనిచేసినదికూడా శ్రామికులే. కాని, ఆవిజయాన్ని ఉపయోగించుకొనే విధానం వారెరుగరు. ఆఖరుకి రిపబ్లికు స్థాపించడంకూడా వారికి చేతకాలేదు. అది మొదలుకొని ఈగడచిన 18 ఏళ్ళలోనూ శ్రామికవర్గంయొక్క సంఖ్యాబలమూ హెచ్చింది. వారి జ్ఞానమూ పెంపొందింది. కనుకనే వారు ఈమారు తాము పొందిన విజ

యాన్ని ఉపయోగించుకోవడానికే నిశ్చయించేరు. తాత్కాలిక ప్రభుత్వం ఏమి చెయ్యడానికీ నిశ్చయించుకోలేక, భవిష్యద్రాజ్యాంగవిధానం ఏమిటో ప్రకటించడానికి వీలుచిక్కనన్ని సాకులు చెప్పి వాయిదాలు వెయ్య సాగింది. కాని, ఆనాటి కింకా కార్మికులు తమ ఆయుధాలు క్రింద పెట్ట లేదు. వారు ఒత్తిడి పెట్టడంతో విధిలేక 'రిపబ్లికు' ప్రకటించక తీరింది కాదు. కాని, రాజ్యాంగంలో వట్టి మార్పు వచ్చినంతమాత్రాన శ్రామికు లకి తృప్తి కలగలేదు. వారు శ్రామికుల పరిస్థితులలో అతి ముఖ్యమైన సోషలిస్టుమార్పును తీసుకురాదలచేరు. ఫ్రెంచి శ్రామికులు తమ వాంఛల్ని బయటపెట్టడం అదే మొదలు: శ్రామిక సంఘాలు ఏర్పరచు కుందుకు హక్కు; ప్రతి మనిషికి పనిచేయడానికి అవకాశం కలిగించే హక్కు; ఈ హక్కుల్ని కాపాడడానికై కార్మికశాఖామంత్రిని ఏర్పాటుచ డం; ఇవీ వారి కోరికలు. అధిక సంఖ్యగల బూర్జువాలతో ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వంలో పెట్టీబూర్జువా ప్రతినిధుల్నికూడా చేర్చుకుందుకు శ్రామికవర్గం బలవంత పెట్టింది. (పెడ్రూరోలిన్; ఫ్లోకోన్; 'శ్రామిక సంఘం' ద్వారా సంఘాన్ని శాంతియుత పద్ధతులమీద మార్చడానికి ఒక ప్రణాళిక తయారు చేసిన లూయీ బ్లాంకు; ఆల్బర్టు అనే శ్రామికుడూ; ఈవిధంగా తాత్కాలిక ప్రభుత్వంలో ప్రవేశించేరు.)

"ఆయుధబలంతో సాధించేక శ్రామికవర్గం దానిమీద తన ముద్ర వేసి, సోషలిస్టు రిపబ్లికును ప్రకటించింది. ఆధునిక విప్లవాల సాధారణ స్వరూపం ఆవిధంగా నిరూపించబడింది."

(లూయీ బోనపార్టీయొక్క బ్రూమెయిర్ 18 వ తేదీ పుట. 30)

పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం ప్రాధాన్యతను వహించనిదేశంలో- అధికోత్పత్తివిధానం ఇంకా బలపడని అవస్థలో సోషలిజం విజయం

పొందడం అసంభవం. కాని, శ్రామికవర్గం తమసామర్థ్యాన్ని ప్రకటించి రాజరికాన్ని కూలద్రోసింది. కొత్తగా ఏర్పడ్డ ప్రభుత్వాన్ని తన చెప్పు చేతలలోకి తెచ్చుకో గలిగింది. "పనిచేయడానికి హక్కు" అనే మాట లలో అర్థంలేదు. అప్పుడు నిజంగా ఆలోచిస్తే ఉత్పత్తి సాధనాలు సమాజపరం చేయబడినప్పుడే అది సాధ్యం. వారి కోరికలు ఏలాగ వున్నా, ఎత్తుగడలు మాత్రం సరియైనవి. అందుచేతనే బూర్జువావర్గం నుంచి కొన్ని హక్కులయినా లాక్కోగలిగేరు.

శ్రామికవర్గం ఈవిధంగా స్వతంత్రించి కార్యక్రమంలోకి దిగడం, దేశంలోని వర్గాలమధ్యగల పరస్పరసంబంధాలని ఒక్క దెబ్బలోమార్చి పారేశింది. తమలో తమకి ఎన్నికలహాలున్నా ఫిబ్రవరికిపూర్వం బ్యాంక ర్లకి విరుద్ధంగా దేశంలోని వర్గాలన్నీ ఏకీభవించేయి. కాని, శ్రామికవర్గం ఈవిధంగా స్వతంత్రించగానే ధనికవర్గాలన్నీ ఏకీభవించి వారి కెదురు తిరిగేయి. వారంతా రెడ్ రిపబ్లిక్‌కి శత్రువులయ్యేరు. 1848 నాటి అనుభ వాలు మనకి చాలాముఖ్యం. ప్రజాతంత్ర విప్లవంలో, వేరువేరు ఘట్టా లలో, ధనికవర్గంవేసే ఎత్తుపై యెత్తులన్నీ ఆనాటి పోరాటంలోనే స్పష్టం అయిపోయినాయి. అందులో ముఖ్యంగా శ్రామికవర్గం ప్రాధాన్యత వహించి విప్లవము ఒకగతిని నిర్ణయించేటప్పుడు వారి సహాయం ఏవైపునవుండేదీ; పెట్టిబూర్జువాతరగతి ఏమాదిరి స్వభావాన్ని ప్రదర్శిం చేదీ; ఈ విప్లవకాలంలో స్పష్టం అయిపోయినాయి. విప్లవంవలన సిద్ధించవలసిన కోరికలు వున్నాసరే, శ్రామికవర్గంకనక ముందుకు వచ్చిందా పెట్టీబూర్జువావర్గం విప్లవ వ్యతిరేకులతో చేరిపోతుంది.

ఫిబ్రవరి గడిచేక, శ్రామికులు జరిపిన వూరేగింపులు గమనించి పెద్ద పెట్టుబడిదారులకీ, మధ్యతరగతివారికీ శ్రామికవర్గం పెనుభూతంలా

కనబడింది. అప్పటినుంచీ పట్టణాలలోనూ- పల్లెలలోనూగల మధ్య తర గతు లందరినీ తమతో కలుపుకుందుకు పెట్టుబడిదార్లు బ్రహ్మాండమైన ప్రయత్నాలు సాగించేరు.

## లూయీ బ్లాంకు : ఆతని వూహాలూ

తాను సంపాదించిన విజయాన్ని ఏలాగ ఉపయోగ పరచుకో వాలో శ్రామికవర్గానికే తెలియదు. విప్లవం కోసం తపించిపోయే బ్లాంకు సహచరులకి ఆమాత్రపు బలంలేదు. శ్రామికులలో ఎక్కువమందికి బ్లాంకుమీద అభిమానం. ఇతగాడయినా ఉటోపిస్టులందరికిమల్లేనే, అన్ని వర్గాలయొక్క సహకారంతో శాంతిపద్ధతులమీద సోషలిజం స్థాపించ గలం అంటాడు.

"తన అధికారం, స్థితి, పెరిగిన వాతావరణాన్నీ ఒక్కమారు మరచిపోయి స్వతంత్రంగా ఆలోచించినట్లైతే, ఎవ్వడూ కూడా ఈనూతన సాంఘిక విధానం వొద్దనడు.—అత్యవసరమైన ఈవిప్లవాన్ని అతిసులభంగానూ, శాంతిపద్ధతులమీదా సాధించవచ్చును."

ఈఅభిప్రాయాల్నిపట్టే, ఆతడు పారిస్ శ్రామికులలోని విప్లవోత్సా హాన్ని చంపేసి, తాత్కాలిక ప్రభుత్వాన్ని నమ్మివుండండని వారిని హెచ్చరించేడు. సాంఘికములయిన కోరికల్ని పరిశీలించడానికై ప్రభు త్వముఏర్పరచిన 'కమీషను'కి వొప్పుకోండని వొత్తిడిచేసేడు. (ఈ కమీ షను తన మీటింగులన్నీ లగ్జెంబర్గులోనే జరపడంచేత దీనిని 'లగ్జెంబర్గ కమీషను' అంటారు.) ఈ కమీషనులో యజమానుల ప్రతినిధులూ, శ్రామికుల ప్రతినిధులూ సమాన ప్రతిపత్తితో సభ్యులుగా ఆహ్వానించ బడ్డారు. బ్లాంకు అనుచరులు ఆరోజులలో "రివల్యూషనరీ క్లబ్బు' లంటూ

సాగించేవారు. వాటియొక్క ప్రచారంవలన కార్మికవర్గం కొంతవరకు తెలివితెచ్చుకొని తాత్కాలిక ప్రభుత్వం యెడల అసమ్మతిచూపుతూ, ప్రభుత్వం తిరిగి ఏర్పరచబడాలనీ, శాసనసభా ఎన్నికల గడువు పొడిగించబడాలనీ కోరుతూ వారొక బ్రహ్మాండమైన ఊరేగింపు లేవదీసేరు. మొదట ఏర్పరచబడిన గడువు ఎంతో దూరంగాలేదు. అంత స్వల్ప కాలంలో శ్రామికులు తమప్రచారం సాగించలేమని సరిగ్గానే గ్రహించేరు. ఆ ఊరేగింపుయొక్క వుద్దేశాలని మార్చాలని లూయీ బ్లాంకు ఎంతో తంటాలుపడ్డాడు. చిట్టచివరకి సాధించేడు. వారిలో తనకున్న పలుకుబడిని పురస్కరించుకుని, రెండులక్షలమందితో బయలుదేరిన ఆ అసమ్మతి ప్రదర్శనాన్ని (మార్చి 17.) పెడ్రూ రోలిన్‌లాంటి మితవాద సభ్యులయెడ విశ్వాసాన్ని ప్రకటించే ప్రశాంతమైన ఊరేగింపుగా మార్చి వేయగలిగేడు. ఎన్నికలగడువు రెండువారాలకి పొడిగించడానికి ప్రభుత్వం అంగీకరించింది. కాని, దానిని శ్రామికవర్గం సరిగ్గా వుపయోగించుకోలేకపోయింది. ఒకమూల పెట్టుబడిదారీవర్గం బ్రహ్మాండం తలక్రిందులుచేస్తూ, శక్తి కూర్చుకుంటూండగా; శ్రామికవర్గం లగ్జెంబర్గు కమీషనుతో కాలం పాడుచేసుకుంది (లూయీ బ్లాంకు ఈ కమీషనుకి అధ్యక్షుడు. 1917 లో మెన్షివిక్కులూ, సోషల్ రివల్యూషనరీలూ ఈ మాదిరి ఎత్తే ఎత్తినప్పుడు, లెనిన్ 1848 నాటి మాట జ్ఞాపకంచేస్తూ, 'లూయీ బ్లాంకు బోల్తా' లో పడవద్దని శ్రామికుల్ని హెచ్చరించేడు.)

దేశంలోని వర్గాలన్నింటినీ ఏకీభవింపచేసి, శ్రామికులమీది కెదురు తిప్పడానికై తాత్కాలిక ప్రభుత్వం ఈ గడువునంతనీ పూర్తిగా వినియోగించుకుంది. జూలై రాచరికంనాటి బడ్జటులో నష్టంకనబడుతూన్నా పెద్దపెట్టుబడిదారులమీద పన్నులు వెయ్యడానికి ప్రభుత్వం జంకింది.

వాయిదాలు సమీపించకపోయినా ప్రభుత్వపత్రాలమీద వడ్డీలు చెల్లించి వేయబడినాయి. సేవింగ్సుబ్యాంకులు నూరుఫ్రాంకులకి మించినమొత్తాన్ని ఇవ్వగూడదని నిషేధించబడింది. పైగా రైతులమీద ప్రత్యక్షపన్నులు విధించబడ్డాయి. 45% హెచ్చుపన్ను రైతులమీద పడింది. ఈవిధంగా, రైతులు శ్రామికవర్గానికీ, వారిచేత బలపరచబడుతూన్న రిపబ్లికను విధానానికీ శతృవులుగా తయారు చెయ్యబడ్డారు.

## జూన్ దినాలు

1848 మార్చి మొదటివారపు రోజులలో నిరుద్యోగులకొరకై ప్రభుత్వం 'జాతీయకర్మాగారాలు' తెరిచింది. ఈసూచన యిచ్చినది, బహు మితవాదకక్షకి చెందిన ప్రభుత్వసభ్యులే. ఈ 'నేషనల్ వర్కుషాపు'లో చేయించేపనికి అర్థంలేదు. వాటిలో ఒక్క వస్తువుకూడా తయారుకాలేదు. అసలు వీటిని ఏర్పరచడంలోకూడా వస్తువులు తయారు కావాలనే సంకల్పంలేదు. నిరుద్యోగుల్ని తమవైపుకి త్రిప్పుకోవడం; శ్రామికులుకోరే సౌకర్యాలయెడల ప్రజల కసహ్యం కలిగించడం,— వీటి నేర్పరచిన వుద్దేశం. దేశంలో నిరుద్యోగసమస్య బహు తీవ్రంగావుంది. మే నెలనాటికి ప్రభుత్వపు వర్కుషాపులలో లక్షమందికి పైగా కూలీలు పనిచేస్తూన్నారు. కాని, ప్రభుత్వం ఆశపడినట్లుగా వీరు విప్లవవ్యతిరేకులుగా మారిపోలేదు. దానిమీద ఇక లాభంలేదనుకుని ప్రభుత్వంలోని మితవాదకక్షలు ఈ నేషనల్ వర్కుషాపుల్ని చూపించి విప్లవవ్యతిరేక ప్రచారం సాగించేరు. "లక్షమంది సోమరిపోతులు ఫ్రాన్సుదేశపు ఆదాయంమీద బ్రతుకుతూన్నారు. ఆస్తిపాస్తులు పంచుకోవాలనే సోషలిస్టులు చెయ్యగలదిదే. త్వరలో మరోలక్షమంది పోషణభారం పడుతుందంటే

ఏమీ ఆశ్చర్యంలేదు. ఈ నిర్భాగ్యుల పోషణకే పన్నులు హెచ్చించ వలసి వచ్చింది. ఈ విధానం నశించాలి"— "ఆస్తుల పంపకాన్ని సాగ నియ్యవద్దు"— "రెడ్ రిపబ్లిక్ ఏర్పడకూడదు." అనే నినాదాలతో శ్రామికవర్గానికి వ్యతిరేకంగా 'సమ్మిశ్రిత సంఘటన' ఏర్పరచబడింది.

ఈపరిస్థితులలో ఏప్రియలు 23 న జరిగిన ఎన్నికలలో విప్లవవ్యతి రేకులు పూర్తిగా విజయం పొందేరంటే ఆశ్చర్యం ఏముంది? కాని, శ్రామికులు తమపట్టు వదలలేదు. పోలండు జరిపే స్వాతంత్ర్యపోరాటా నికి సహాయపడాలనీ; యూరపులోని విప్లవోద్యమాలకి చేయూత నియ్యా లనీ, నేషనల్ ఎస్సెంబ్లీని కోరుతూ, సభలూ, వూరేగింపులూ సాగిం చేరు. ఆఖరుకి మే 15 వ తేదీన బలవంతంగా ఎసెంబ్లీసభని రద్దు చేయ డానికై హాలులో ప్రవేశించబోయేరు. కాని, వారి ప్రయత్నాలు సాగలేదు. ఇంక లాభం లేదనీ, పారిస్ శ్రామికుల్ని నాశనంచేసి తీరాలని విప్లవ వ్యతిరేకులు నిర్ణయించేరు. నగరంలో సేనలు సమకూర్చ బడ్డాయి. శ్రామికవర్గాన్ని సమూలంగా నాశనం చెయ్యడానికై పన్నాగాలు పన్న బడివాయి.

నేషనల్ వర్కుషాపులు రద్దుచెయ్యడానికై జూన్ 21 వ తేదీన ప్రభుత్వం నిర్ణయించింది. 18-25 ఏళ్ళలోపు పెళ్ళికాని కూలీలు సైన్యా లలో చేరాలనీ, మిగిలినవారిని వేరువేరు రాష్ట్రాలకి పంపించే ఏర్పాట్లు జరపబడతాయనీ ప్రకటించేరు. ఈవిధంగా ఒక లక్షమంది కూలీల నోట దుమ్ము కొట్టాలని చేసిన ప్రయత్నానికి శ్రామికవర్గం ఆయుధాలతో సమా ధానం ఇచ్చింది. జూన్ 23 మొదలు 28 వరకూ నాలుగు రోజులపాటు వారు బారికేడ్సు వెనక నిలచి భయంకర యుద్ధం చేసేరు. ఆదాడికి నిల బడలేక 'ధీర్సు' (విప్లవ వ్యతిరేకుల నాయకుడు) పారిస్ వదలి పెట్ట

డానికి నిశ్చయించేడు. చిట్టచివరకి ఏలాగైతేనేం సైన్యాల - నేషనల్ గార్డుల సహాయంతో జనరల్ 'కవైనాగ్' రక్తప్రవాహాల్లోముంచి, తిరుగుబాటును అణచగలిగేడు.

ధనిక సమాజంలోని వర్గాలన్నిటికీ వ్యతిరేకంగా శ్రామికవర్గం జరిపిన మొట్టమొదటి పోరాటం ఇదే. ఇదే దీనిలోగల ప్రత్యేకతకూడా. అంతమాత్రంచేత శ్రామికులు తమగమ్యాన్ని బాగా అర్థం చేసుకొనే ఈ పోరాటం సాగించేరనుకోడానికి వీలులేదు. వారు ప్రజలకి చేసిన ప్రకటనలో ఒకదానిలో—"రిపబ్లిక్కుకోసం మేము సాగించే పోరాటం, ఆస్తి హక్కుల్ని సంరక్షించేటందుకై చేసేదే." అని వ్రాయడంలోనే వారిలోగల చైతన్యం అర్థం అవుతూంది. ప్రభుత్వనిర్మాణాన్ని సూచించే ప్రకటనలో వారు బ్లాంక్వీ - బ్లాంకులతోపాటు బూర్జువా రిపబ్లికనులా, నెపోలియనుయొక్క పేర్లుకూడా సూచించేరు. తిరుగుబాటుదారులలో కొందరు 'నేషనల్‌వర్కుషాపు'ల్ని సాగించాలనీ; 'పనిచేసే హక్కు' 'శ్రామిక సంఘాల నిర్మించుకొనే అధికారమూ' కావాలని కోరేరు. నేషనల్ ఎస్సంబ్లీ రద్దుకావాలని కొందరు కోరేరు. అరెస్టు చెయ్యబడి కోర్టుకీడ్వబడినవారిలో మూడువంతులకు పైగా కూలీలే. విద్యావంతుల-విద్యార్థుల సంఖ్య బహుస్వల్పం. తిరుగుబాటుకి వెనుక ఆసరాలేకుండా దానంతటదే బయలుదేరింది. ప్రజలు తమంతతామే వీధులకి అడ్డంగా బారికేడ్లు నిర్మించుకున్నారు. వీరిని నడిపించగల కేంద్రం లేకపోయింది. కాని సమయానికి అవసరం వచ్చేటప్పటికి, అదివరకు పోరాటాలలో అనుభవమున్న బ్లాంక్విస్టులూ, కమ్యూనిస్టులూ, రిపబ్లికనులూ, జాకోబిను అతివాదులూ, శ్రామికులూలోంచి నాయకులు ముందుకువచ్చి ఎక్కడికక్కడే పోరాటాని కాదుకున్నారు.

1848 సంఘటనలు జూన్ తిరుగుబాటుతో పారంముట్టేయి. ఆర్థిక దురవస్థలు; జీతాల తగ్గింపు; పనిగంటల హెచ్చింపు ; వీటివల్ల అసంతృప్తితోవున్న ఇతర రాష్ట్రాల శ్రామికులకి పారిస్ తిరుగుబాటు మార్గదర్శి అయింది అనేక నగరాలలో తిరుగుబాట్లు జరిగినాయి.

జూన్ తిరుగుబాట్లు దానంతటవే వచ్చిన ప్రజోద్యమాలు. మధ్య తరగతుల సహకారం కోల్పోయినప్పటికీ శ్రామికవర్గం ఒక్కటే. కేవలం తన శక్తిమీదనే ఆధారపడి. పెట్టుబడిదారీ సమాజంలోని సమ్మిళితవర్గశక్తులతో పోరాటం సాగించింది.

## బోనపార్టిజం

ఈ జూన్ సంఘటనలు పూర్తి అయినాక బూర్జువా రిపబ్లికనులు తమ నియంతృత్వం స్థాపించుకున్నారు. కాని, ఇదీ ఎంతోకాలం సాగలేదు. మొదటి నెపోలియను తమ్మునికొడుకు లూయీ బోనపార్టీ 1848 డిసెంబరు 10 న. రిపబ్లికుకి ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డాడు. ఈఎన్నికలలో బోనపార్టీకి 55 లక్షల వోట్లూ; ఆతనితో పోటీచేసిన జనరల్ కవైనాగ్‌కి 15 లక్షల వోట్లూ వచ్చేయి. ఈ డిసెంబరు ఎన్నికలలోగల రహస్యాన్ని మొట్టమొదటిమారుగా బయటపెట్టినది మార్క్సు. శ్రామికులు అధికారంలోకి వస్తే తమభూములన్నీ లాగివేయబడతాయనే భయంతో చిన్నరైతులు చేసిన పోరాటం అది. పెద్దపెద్ద ధనికులమీద వారికిగల అయిష్టతా, శ్రామికవర్గం యెడగల అసహ్యమూ ఎన్నికలో స్పష్టం అవుతూన్నాయి. మొదటినెపోలియనుయెడల రైతాంగానికి మంచి విశ్వాసం వుంది. ఆతడు యూరపుఖండంలో పొందిన విజయపరంపరలవలననే, విప్లవకాలంలో తమకి స్వాధీనం అయిన భూములు

తమచేతులలో నిలబడ్డాయని వారి వూహ. ఆతనిమీదగల అభిమానమే తమ్ముని కొడుకుమీదా చూపించేరు. బోనపార్టీలు రైతుమిత్రులని చిన్న భూస్వాముల నమ్మకం. చిన్నరైతులకీ - పెద్ద ధనికులకీగల వైరుధ్యానికి డిసెంబరు ఎలక్షను నిదర్శనం. అంతేకాదు. సైన్యాలలో కొంత భాగం - ముఖ్యంగా జూన్ సంఘటనలలో తమ ప్రతిభనంతనీ ప్రదర్శించిన సేనాధిపతుల, మనస్తత్వాల్నికూడా డిసెంబరు ఎలక్షను బోధపరుస్తూంది. ఆరోజులలో పారిసులోని ఒక రష్యను గూఢచారి పీటర్సుబర్గుకి వ్రాసిన లేఖ చూస్తే ఈవిషయం బోధపడుతుంది.

## 1848 ఫ్రెంచి విప్లవం

ప్రభుత్వం మారాలనే వాంఛ సైన్యాలలో అధికంగా వుంది. దేశంలో శాంతి తమవలననే నిలవబడుతూందనీ, రాజ్యాంగంలో తాము అత్యవసరభాగమనీ, ఒకభావం సైన్యంలో బాగా వ్యాపించివుంది. నేటి ప్రభుత్వంమీద దానికి ఇష్టంలేదు. సమర్థుడైన వ్యక్తి దొరికితే, దేశంలో శాంతి నెలకొల్పడానికి అది అన్నివిధాలా తోడ్పడుతుంది.

ఆరోజులలోనే ఒక ఫ్రెంచి సేనాధిపతి సగర్వంగా - "నాకు తోచిన వాడిని ఈవేళ చక్రవర్తిని చెయ్యగల" నన్నాడు. పోనీ యని చూడబోతే లూయీ నెపోలియన్ విశాలభావాలుగలవాడు కాదు. వట్టి చేతగాని సాహసం మాత్రం వుంది. ఎప్పుడూ అప్పులలో మునిగివుంటాడు. కొద్దిలక్షల ఫ్రాంకు లిస్తేచాలు, రష్యను ప్రభుత్వానికి అమ్ముడుపోడానికి వెనుతియ్యడు. 1848 ఏప్రియలు నెలలో ఛార్టిస్టుల్ని అణిచివేసేటందుకై, ఆతడు స్పెషల్‌కాన్‌స్టబుల్‌గా పనిచేసేడని బ్రిటిషువారు మాత్రం అభినందిస్తూంటారు.

దేశం అంతటా నిర్బంధవిధానం తీవ్రవేగంతో వ్యాపించింది. దాని దాడినుంచి మధ్యతరగతికూడా దాటిపోలేదు. ఫలితంగా వీరు మళ్ళీ ప్రభుత్వం యెడ అసంతృప్తిచెంది శ్రామికవర్గంతో కలియడానికి సిద్ధం అయ్యేరు. 1849 జూన్ 13 న ప్రభుత్వచర్యలకి అసమ్మతి చూపుతూ పారిస్‌ప్రజలు సాగించిన ప్రచారం అణిచివెయ్యబడింది. ధనికవర్గం చేతిలోనే అధికారంవున్నా వారు 'ప్రజలలో శాంతి' నెలకొల్పలేకపోయేరు. 1849 మేనెలలో జరిగిన ఎన్నికలలో అతివాద పార్టీయైన సోషల్ డెమాక్రటిక్‌పార్టీ జయం పొందడంతోనే, వెంటనే ధనికవర్గం 1850 మే 31 నాటికి శాసనభకి వోటుహక్కులు సంకుచితపరుస్తూ శాసనం చేసేరు. ఈస్థితిలో బూర్జువావర్గం మనస్తత్వం తెలుసుకోవడం అవసరం. ఏవిధంగానైనాసరే 'శాంతి' నెలకొల్పడానికి వారిలో ఆతురత ఎక్కువయింది. శాంతి ఏర్పడి, తమ హక్కులు సంరక్షింపబడే మాటుంటే, ధనికవర్గం తన చేతిలోవున్న రాజ్యాంగాధికారం కూడా ఇచ్చేస్తారు. ఆనాటికే లూయీ నెపోలియను తన నిరంకుశాధికారం స్థాపించుకుందుకు సర్వశక్తులూ వినియోగించి పనిచేస్తూన్నాడు. ఈ సమయంలో ధనికవర్గం తమ వర్గ హక్కుల్ని రక్షించుతూన్న పార్లమెంటుసభ్యులకి సహకారం చెయ్యడం మానుకుంది.

ధనికవర్గం యొక్క ధోరణినిపట్టి చూస్తే; తన హక్కుల్నీ, వర్గ సౌకర్యాలనీ, రాజకీయాధికారాన్నీ; నిలబెట్టుకుందుకు పోరాడడం అనవసర ప్రయాసయనీ; తమ వ్యవహారాలకి అభ్యంతరకరంగా వుందనీ; వూహిస్తూన్నట్లు తోస్తుంది. అసాధారణాధికారాలతో బలిష్ఠమైన ప్రభుత్వం స్థాపించబడాలని దాని కోరిక. ఆప్రభుత్వంయొక్క సంరక్షణలో - వ్యాపారస్థులు నిర్విచారంగా తమ వ్యాపారం సాగించుకోవచ్చునని

వూహించేరు. అందుకోసం సంపూర్ణంగా తన చేతిలోవున్న ప్రభుత్వాధికారాన్ని వొదులుకుందుకే ధనికవర్గం హడావిడిపడసాగింది........

"తమ చేతిలోని అధికారం ఇచ్చేసి ధనసంచులు కాపాడుకోడానికై చేసిన ఈ రాజ్యాంగాధికార విసర్జనానికి ఒక్క ధనికవర్గమే గాక మిగిలిన వర్గాలుకూడా బాధ్యులే."

(బ్రూమైర్ పద్దెనిమిదో తేదీ. పుట 113)

బోనపార్టీ అంత సులభంగా విజయం పొందడానికి ఏర్పడిన పరిస్థితులివి. 1851 డిసెంబరు 2 వ తేదీన నేషనల్ ఎస్సంబ్లీని రద్దు చేసేసేడు. సార్వజనిక వోటు హక్కు తిరిగి స్థాపించేడు. తన అధికార వ్యవధి పొడిగించుకున్నాడు. ఓ ఏడాది పోయేక 1852 డిసెంబరు 2 న మూడవ నెపోలియనుగా చక్రవర్తిత్వం ప్రకటించుకున్నాడు. బూర్జువా వర్గం ఆ అధికారానికి తల వొంచింది.

## బోనపార్టీజం : ఫాసిజం

పెట్టుబడిదారీ యుగంనాటి ఈ బోనపార్టీజానికీ - సామ్రాజ్యవాద యుగంనాటి ఫాసిజానికీ తేడా చాలావుంది. ఈ రెండు పద్ధతులూ పుట్టడానికిగల కారణాలూ వేరే. వాటిగమ్యాలూ వేరే. ఈ రెండూ ఒకటేనని వూహించడం అనాలోచితం. ఫాసిజం అంటే ఏమిటో ముందు ముందు వేరే వ్రాయబడుతుంది. ఇక్కడ మాత్రం దానికీ - బోనపార్టీజానికీ గల భేదాలలో ముఖ్యమైనవి ఒకటో రెండో మాత్రం చెప్పి వదులుతాను. రెండవ రిపబ్లిక్కు కాలంలో (1848-52) శ్రామికవర్గంయొక్క విజృంభణకి భయపడి ఫ్రెంచి బూర్జువావర్గం బోనపార్టీ అనే నిరంకుశ పరిపాలకుని చేతిలో రాజ్యాంగం వుంచడం అనేది బూర్జువారాజ్యాంగ నిర్మాణం

లోని ఒక అవాంతర ఘట్టం మాత్రమే. అధికారం సంపాదించడానికీ, నిలువపెట్టుకోడానికీ బోనపార్టీ వేరు వేరు వర్గాలని బోల్తాలు కొట్టించిన పద్ధతులు చూస్తేనే ఆనాటి పరిస్థితులు అర్థం అవుతాయి. బూర్జువావర్గానికి స్వయంగా రాజ్యాంగం నిర్వహించుకోగలమనేధైర్యం ఏమాత్రమూ లేదని దానివలననే తేలిపోతూంది. ఆ ఆత్మవిశ్వాసం కలిగినవెంటనే వారు రాజ్యాంగాధికారం మళ్ళీ తీసుకున్నారు. తరవాత ఎంతోకాలం రిపబ్లికన్ ప్రజాతంత్ర విధానం సాగించబడింది. ప్రజాతంత్ర పార్లమెంటరీ విధానాలనే తెరలమాటున నిరంకుశ ప్రభుత్వమూ సాగించబడింది. ఇప్పుడు బోనపార్టీజానికి తలవొగ్గడం అనేది ఒక చిన్న మెట్టు. బూర్జువా పార్లమెంటరీవిధానం మరుగున తన నిరంకుశ పరిపాలన సాగించుకునేందుకు అవకాశం ఇచ్చే రాజ్యాంగాన్ని స్థాపించే ప్రయత్నంలో, తాత్కాలిక దౌర్బల్యంకొలదీ బూర్జువావర్గం తీసుకున్న విశ్రాంతి ఇది. కాని, ఫాసిజం అనేది సామ్రాజ్యవాద శకంలో వచ్చింది. అప్పటికి బూర్జువావర్గం అధికారం తీసుకుంది. పార్లమెంటరీ విధానాన్ని సాగించింది. మొదటి సామ్రాజ్యవాద యుద్ధానంతరం కలిగిన విప్లవ తరంగాల దాడికి ఆ పార్లమెంటరీవిధానం విచ్ఛిన్నమూ అయింది. ఆ స్థితిలో ఏర్పడినది ఫాసిజం,

తన అధికారాన్ని అధికంగా రక్షించుకోడానికీ - స్థిరపరచుకోడానికీ బూర్జువావర్గం అంతకంతకి హెచ్చుగా పార్లమెంటరీవిధానాల్ని వదలిపెట్టి ఫాసిస్టు పద్ధతుల్ని అవలంబిస్తుంది.

శ్రామికవర్గాన్ని ముందుండి నడిపే విప్లవకరదళాల్ని నాశనం చెయ్యడానికి ముఖ్యంగా ఫాసిస్టు పద్ధతులూ - బహిరంగమైన నియంతృత్వ విధానమూ అవలంబించాలి. మొట్టమొదట ఈ ఫాసిస్టువిధానం

ఇటలీలో అవలంబించబడింది. కాని, త్వరలోనే పెద్ద పెద్ద సామ్రాజ్య వాద ప్రభుత్వాలన్నీ ఆదారే తొక్కుతూన్నాయి. జర్మనీ, ఆమార్గాన్నే అవలంబించి, ఇటలీకి పాఠాలుచెప్పింది. జపాను- అపాఠమే చదివించి. ఒకటేమిటి? ఇంచుమించు సామ్రాజ్యవాదదేశాలన్నీ కొంచెం ఇంచుమించులో ఆ పాఠమే చదువుతూన్నాయి. లూయీ బోనపార్టికాలంలో ధనికవర్గం కొద్దికాలంపాటు రాజ్యాంగాధికారాన్ని అతని అధీనంలో వుంచింది. కాని, "ధనికవర్గం బాగా చిక్కుల్లో పడిపోయిన సమయంలో ఫాసిజం తల ఎత్తుతుంది. అధికారం చేతుల్లోకి వచ్చేదాకా పెట్టుబడిదార్లకు వ్యతిరేకమైన శబ్దజాలాన్ని విచ్చలవిడిగా ఉపయోగించి, ఆ అధికారం కాస్తా చేతిలోపడగానే పెట్టుబడిదారులకి ప్రత్యామ్నాయంగా భయంకర నియంతృత్వం సాగిస్తుంది. అంతవరకూ ప్రజల్ని మోసగించడానికే పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా ఉపయోగించిన శబ్దాలని మూలబెడుతుంది."

—కమ్యూనిష్టు ఇంటర్నేషనలుయొక్క కార్యప్రణాళిక.

బోనపార్టిజం, పెట్టుబడిదారీవిధానం బలపడడానికిచేసే ప్రయత్నంలోని ఒకమెట్టు. తాత్కాలిక విశ్రాంతి.

కాని, ఫాసిజం అనేది విప్లవవ్యతిరేకుల దండయాత్ర. 'దూరదృష్టిలో'; జాగ్రత్తగా ఆలోచించి శ్రామికవర్గ విప్లవం రాకుండా చెయ్యడానికీ, వస్తే ఓడించడానికి సామ్రాజ్యవాదులయిన పెట్టుబడిదారులు చేసే ఎదురు దాడి.

పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా తన సిద్ధాంతాలని వస్నే ఫాసిజాన్నిగూర్చి తెలుసుకోవాలంటే, దాని స్వభావాన్ని స్పష్టం చెయ్యాలంటే, ముందు బోనపార్టిజాన్నిగురించి ఎరిగివుండడం అవసరం. తాను

అధికారంలోకి రావడంకోసం బోనపార్టీ పార్లమెంటులోని బూర్జువావర్గ ప్రతినిధులతో పోరాడేడు. సార్వజనిక వోటు హక్కు స్థాపించేడు. ఇంత చేసినా బోనపార్టీ పెద్దధనికుల, ముఖ్యంగా ఫైనాన్షియల్ బూర్జువాజీ యొక్క ప్రతినిధి. వారే ఆతనికి సహాయం చేసేరు. పార్లమెంటులో వున్న బూర్జువావర్గ ప్రతినిధులు ఆతని అధికారస్వీకరణకి వ్యతిరేకులే. ముసోలినీ, కొందరు ఇటాలియను ఫాసిస్టులూ పార్లమెంటులోని కొన్ని బూర్జువా గ్రూపులతో వివాదపడడమూ; ఫాసిస్టురాజ్యాంగంలో పెద్ద ధనికులకి ప్రాముఖ్యతవుండడమూమాత్రంచేత,- ఫాసిజం బూర్జువావర్గం యొక్క విప్లవ వ్యతిరేకక్రియ అనే యధార్థవిషయంలో మార్పు వుండదు. పెట్టీబూర్జువావర్గం ఫాసిస్టుఉద్యమంలో ప్రాముఖ్యత తీసుకుంటుందనుకోవడం పొరపాటు. పార్లమెంటులోని కొన్ని తరహాల బూర్జువావర్గాలతో పోరాడడంకోసం, ఫాసిజం పెట్టీబూర్జువా ప్రజాసామాన్యంయొక్క తోడ్పాటు తీసుకుంటుంది. 1926 మే నెలనాటి "పిల్సుడుస్కీ" తిరుగుబాటు సమయంలో పోలిషుకమ్యూనిస్టులు ఈ పొరపాటుచేసి దెబ్బతిన్నారు. ఫాసిస్టు ఉద్యమం పూర్తిగా పెద్ద ధనికుల చేతనే నిర్వహించబడుతుంది.

బోనపార్టీ అంతసులభంగా అధికారం స్వాధీనం చేసుకోగలగడానికి కారణం పెట్టీబూర్జువావర్గమూ - రైతు ప్రజాసామాన్యమూ చేసిన సహాయమే. సహజ శత్రువులయిన పెట్టీబూర్జువా తరగతుల తాత్కాలిక సమ్మేళన ఫలితమే బోనపార్టీ విజయం. మళ్ళా కొద్దికాలంలోనే అంటే రెండవ సామ్రాజ్యకాలంలోనే (1852-70) రెండువర్గాలూ పరస్పర శత్రువులుగా మారిపోయాయి. 1848 లో బోనపార్టీ అధ్యక్షుడు కావడానికి కారణం రైతుల వోట్లు. కాని, రెండవసామ్రాజ్యకాలంనాటి చరిత్ర

విషయాలు గమనిస్తే, కొద్దిరోజుల్లోనే బోనపార్టీ బూర్జువావర్గక్షేమం—లాభంకోసం రైతులా - పెట్టీబూర్జువాలా ఆశలు నీటగలిపిందని తెలిసిపోతుంది.

మూడవ నెపోలియనుకాలంలో ఫ్రాన్సు రైతాంగంస్థితి మాదిరిగానే, ఫాసిస్టులు రాజ్యాంగం స్వీకరించినచోట్లలో పెట్టీబూర్జువా ప్రజాసామాన్యంయొక్క స్థితి ఏమాత్రమూ చక్కబరచడానికి ప్రయత్నాలు చెయ్యబడలేదు.

## ఈ విప్లవం వలన నేర్చుకోవలసిన పాఠాలు

బూర్జువా ప్రజాతంత్ర విప్లవంలో శ్రామికవర్గం ఆదినుంచీ తన ప్రత్యేకవర్గ కోరికలను ఎదుట పెడుతూ పాల్గోడంచేత బూర్జువావర్గం మొదటినుంచీ విప్లవవ్యతిరేక దృక్పథాన్నే అవలంబించింది. 1848 విప్లవంలోగల చిత్రం ఇదే. ఇంతకు పూర్వపు విప్లవాలలోకూడా ఈ ప్రత్యేకత లేకపోలేదు. కాని, ఈ ప్రత్యేకత ఇప్పుడంతగా ఎన్నడూ స్పష్టం కాలేదు. ఈ విప్లవంలోగల మరొక చిత్రం ఏమిటంటే పెట్టీబూర్జువా కూడా విరోధివర్గంలో చేరడం. శ్రామికవర్గం, బూర్జువా డెమాక్రటిక్ విప్లవం యొక్క హద్దులుదాటి ముందుకి అడుగు పెట్టగానే పెట్టీబూర్జువా విడిపోయింది. మూడో ముఖ్య ఘట్టం బోనపార్టిజం. రాజరికావస్థనుంచి ప్రజాతంత్రంలోకి పరిణామం పొందే క్రమంలో ఫ్రాన్సులో అదొక తప్పనిసరి ఘట్టం అయి వూరుకుంది. శ్రామికవర్గానికి పరిపాలనాధికారం తీసుకోగల శక్తిలేదు. వారి దండయాత్రల మూలంగా ధనికవర్గం బెదిరిపోయింది. ప్రభుత్వం నిర్వహించలేమనే అధైర్యం కలిగింది. కనుక తాత్కాలికంగా ప్రభుత్వాధికారాన్ని నిరంకుశప్రభువు చేతిలో పెట్టింది.

పెట్టీబూర్జువా తరగతియొక్క పిరికితనం, చేతకానితనం మూలంగానే ధనికవర్గం తమరిని బాధించేటందుకు అవకాశం చిక్కిందని శ్రామిక వర్గం భావించడానికి, లూయీ బ్లాంకుమాదిరి మధ్య తరగతి అవకాశ వాదులు చేసిన ద్రోహకృత్యాలే కారణం అయినాయి. శ్రామికవర్గానికి రైతాంగం సహకారం చేస్తుందనీ; పోరాటంలో శ్రామికవర్గం ముందుండి నాయకత్వం వహించి నడపవలసి యుంటుందనీ, 1848 విప్లవం పాఠం చెప్పింది. 1905—1917 విప్లవాలలో బోల్షివిక్ పార్టీ ఈపాఠాన్ని బాగా జ్ఞాపకం చేసుకుంది.

1848 లో లూయీ బ్లాంకూ; 1917 లో మెన్షివిక్, సోషల్ రివొల్యూషనరీపార్టీలకి చెందిన జరిటెల్లీ - ఛెర్నోవ్‌లూ, కొయలిషన్ ప్రభుత్వంలో పాల్గొవడంవలన కలిగిన ఫలితాలు సరిసమానంగానే వున్నాయి. కర్తీలేని బూర్జువారాజ్యాంగ విధానం సాగించుకోవడానికి వీరు కేవలం అడ్డుతెరగా వుపయోగించేరు. వారు ప్రభుత్వంలో పాల్గొనడం ధనికవర్గానికే వుపకరించింది. ప్రభుత్వం మీద ప్రజలకి గల అవిశ్వాసం పోగొట్టడానికి వీరి వునికి బాగా వుపయోగించింది. ఏదో విధంగా ఈ సోషలిస్టు మంత్రులు ప్రజోపయోగకార్యాలు చేస్తారనే భ్రమ శ్రామిక వర్గంలో కొందరికి యేర్పడింది. దీనివలన శ్రామికవర్గంలోనే చీలికలు కలిగి వారి పోరాటశక్తి క్షీణించినది. 1848 లో ఫ్రాన్సులోనూ, 1917 లో రష్యాలోనూ బూర్జువావర్గాలు ఈ లూయీ బ్లాంకుతోగాని, జరిటెల్లీ - ఛెర్నోవ్‌లతోగాని నిమిత్తం లేకుండానే తమ యిచ్ఛవచ్చినట్లుగానే అధికారం సాగించేయి. శ్రామికవర్గోద్యమాన్ని బలహీనం చెయ్యవలసి వచ్చినప్పుడుకూడా జర్మను ధనికవర్గం ఇదే పంథా తొక్కింది. ఎన్నికలలో అతివాదులకి మంచి మెజారిటీ వచ్చి

నప్పుడు మంత్రాంగంలోకి 1923, 1928 లలో సోషల్ డెమాక్రాట్లని పిలిచేరు. బూర్జువావర్గం కాస్త తిరగబడి ఊపిరి తీసుకోగానే మళ్ళీ సోషల్ డెమాక్రాట్లని తరిమివేశారు. 1848 లో లూయీ బ్లాంకుకీ ఇదేగతి పట్టింది.

(1871 లో లూయీ బ్లాంకు వర్సెయిల్సు కూటంతోచేరి పారిస్ కమ్యూన్‌యొక్క శత్రువుల్ని బలపరిచేడు. అలాగే జర్మన్ సోషల్ డెమాక్రాట్లు కూడా తాము ప్రభుత్వంలో లేకపోయినా బూర్జువావర్గాన్ని బలపరుస్తూ, శ్రామికుల్ని నిరాయుధుల్నిచేసి, వారి నిర్మాణాలని నాశనం చేయడానికే ప్రయత్నించేరు. కాని, ఒక్క చిన్నతేడా. లూయీ బ్లాంకు, కవైనాక్ నియంతృత్వానికి దారిచేసి పెట్టేడు. సెవెరింగ్ - జార్జిగ్‌లు బుద్ధిపూర్వకంగా తమచేతులతో విప్లవప్రజోద్యమాన్ని అణిచి నాశనం చేసివేసేరు.)

## ప్రశ్నలు

1. 1848 ఫ్రాన్సు విప్లవం యొక్క వర్గ స్వభావం ఏమిటి?
2. 1789 లో పట్టణవాసులయిన పెట్టీబూర్జువాలు విప్లవంలో తోడ్పడడానికీ, 1848 లో ఎదురు తిరగడానికీ హేతువు లేమిటి?
3. లూయీ బ్లాంకు కాలంనాటి శ్రామికవర్గపు అనుభవాలు లెనిన్‌కి ఏవిధంగా తోడ్పడ్డాయి.
4. బోనపార్టిజానికి కారణాలేమిటి? దాని వర్గ స్వభావం ఏమిటి?
5. బోనపార్టిజం, ఫాసిజం వీనికి గల తేడా లేమిటి?

# జర్మనీ - ఆస్ట్రియాలలో

## (1848 నాటి విప్లవం.)

### విప్లవానికి పూర్వం జర్మనీ స్థితి:

### రాష్ట్ర సమ్మేళన సమస్య.

ఒక మూల ఫ్రాన్సు పూర్తిగా బూర్జువా రాజ్యాంగంగా మారి పోతూంది. అయినాకానీ, ఇతర దేశాలలోమాత్రం ఇంకా చలనం కలగ లేదు. పెట్టుబడిదారీవిధానం విచ్చలవిడిగా అభివృద్ధి చెందడానికి వీలు లేకుండా యూరపుఖండ రాజ్యాలలో ఎన్నో అడ్డంకులూ, ఆటంకా లూనూ. పారిస్‌లో వచ్చిన ఫిబ్రవరి విప్లవం ఇతర దేశాలలోకూడా కదలిక కలిగించింది. 1848 మార్చినెల 13 న ఆస్ట్రియా రాజధాని వియన్నాలోనూ; మార్చి 18 న ప్రష్యారాజధాని బెర్లినులోనూ విప్లవాలు వచ్చేయి. విజయం పొందేయి.

ఈనాడు మనం జర్మనీ అని పిలచేది బూర్జువా విప్లవానికి పూర్వం ఒక్క దేశంకాదు. ఎన్నో చిన్నచిన్న రాష్ట్రాలుగా చీలివుండేది, ఆనాటికి. కనక ఆ దేశాలలో వచ్చిన బూర్జువా విప్లవానికి "జాతీయైక్యత" అనేది ముఖ్య నినాదం అయింది. ప్రపంచవ్యాపార మార్గాలనుంచి దూరం చేయ బడిన జర్మనీ, 17 వ శతాబ్దంనాటినుంచీ చిన్నచిన్న సంస్థానాలుగా విడి పోయింది. వాటన్నింటికీ వేరు వేరు పన్నులు. నాణెములు వేరు. తూకం, కొలమానాలు వేరు. రాజకుటుంబాలు వేరు. విదేశవ్యవహారాలు దేనివి దానివే ప్రత్యేకం. 1848 నాటికి జర్మనీ 5 రాజ్యాలుగానూ, 31

సంస్థానాలుగానూ వుండేది. ఈలాంటి దేశంలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి పొందాలంటే ముందు దేశం అంతా ఒకే ఒక రాజ్యాంగం కావాలి. మార్కెటువిధానం ఒక్కటేవుండాలి. విదేశనీతి ఒక్కటే వుండాలి. దేశం అన్నిమూలలా మనుష్యులూ - సామానులూ స్వేచ్ఛగా తిరగడానికి సావకాశాలు ఏర్పడాలి. సంస్థానానికీ, సంస్థానానికీ మధ్య సుంకపుగోడలు పోవాలి. అప్పుడప్పుడే తలయెత్తుతూన్న జర్మను పరిశ్రమల్ని బ్రిటిషు పరిశ్రమలు గొంతునులుముతూండడంచేత, దేశం అంతా ఒకేమాదిరిగా దిగుమతిసుంకాలు ఏర్పరచాలి. ఈ విషయంలో జర్మను బూర్జువాజీ కొంతవరకు సఫలం అయింది. 1834 లో "ట్సోల్ ఫెరిన్" అంటూ విదేశీయులకి వ్యతిరేకంగా ఒకే ఒక రక్షణ సుంకపు విధానాన్ని అవలంబిస్తూన్న కొన్నిరాష్ట్రాల యూనియన్ ఏర్పడింది. కాని. అదికూడా దేశానికంతకీ వర్తించదు. రాజకీయైక్యతకూడా సమకూడ లేదు. జర్మను జమీందారీకుటుంబాలు, రాజకుటుంబాలతో సన్నిహిత సంబంధాలు కలిగియుండి, తమ స్థానికాధికారాల్నీ, సౌకర్యాలనీ, వదులు కుందుకు అంగీకరించడంలేదు.

ఫ్రాన్సు కంటేనూ జర్మనీ వ్యవసాయ ప్రధానమైనదేశం, ఆనాటికి. అంతే, ఏకీభావంపొంది ఒకే ఒక రాజ్యాంగంగా ఏర్పడక పూర్వంనాటికి. ఫ్రాన్సులో చిన్నచిన్న భూస్వాము లధికం. పశ్చిమాన్నీ-దక్షిణాన్నీ మినహా జర్మనీలో పెద్ద జమీందారీలు ఎక్కువ. ఆనాటి కానాడు ఇంగ్లాండులో పరిశ్రమలు పెంపొందినకొలదీ వారు ధాన్యాని కెక్కువగా ఇతర దేశాలమీద ఆధారపడవలసి వచ్చింది. ఇక నేముంది? తూర్పు ప్రష్యాలోని జమీందార్ల రొట్టె నేతిలో పడింది. మొట్టమొదట ఈ జమీందార్లు రైతుల వెట్టిచాకిరీనే ఉపయోగించి వ్యవసాయం పెంపొం

దించేరు. కాని త్వరలోనే ఈ వెట్టి పద్ధతివలన తనకేమీ లాభంలేదని భూస్వామి గ్రహించేడు. క్రమంగా రైతులకి స్వాతంత్ర్యం ఇచ్చివెయ్య బడింది. ప్రష్యాలోనూ- తూర్పు జర్మనీ రాష్ట్రాలలోనూ ఈ స్వాతంత్ర్యం పొందిన దాసులు కేవలమూ వ్యవసాయకూలీలుగా తయారయ్యేరు. వారి స్వాధీనంలో ఏ కొద్దిమాత్రం భూమేనావుంటే అది వారి తిండికే చాలదు. కనక జీవితాధారాలకోసం వారు ప్రక్కనున్న జమీందారీ సేరీలమీద ఆధారపడవలసి వచ్చింది.

1800 మొదలు 1850 వరకూ సాగించబడిన సంస్కరణల ఫలితం ఇది. 1850 దాటేసరికే దేశంలోని భూమిలో నూటికి 64—80 వంతులు పెద్ద భూస్వాముల చేతులలో వుండిపోయింది. తన దాసత్వం పోగొట్టుకుందుకు రైతులు డబ్బో, సగమో - మూడోవంతో భూమీ జమీందార్లకి అచ్చుకోవలసి వచ్చింది. ఈ విధంగా జమీందారీ ఆర్థిక విధానం నెమ్మదిగా పెట్టుబడిదారీ వ్యవసాయపద్ధతిలోకి పరిణామం నెమ్మది నెమ్మదిగా జరగడం వలన రైతాంగం ఎన్నో బాధలు పడవలసి వచ్చింది. ఫ్రాన్సులో మహావిప్లవానికీ, రష్యాలో 1905 విప్లవానికీ వలెనే జర్మనీలోకూడా విప్లవానికిభూమిసమస్యే ప్రధానకారణంఅనుకోడంతప్పు. జర్మనీ తూర్పురాష్ట్రాలలో పెద్ద ఎస్టేట్లు ఎక్కువ. పడమటిరాష్ట్రాల్లో చిన్న రైతాంగం ఎక్కువ. ఈ రెండింటిమీదా జర్మనీలో పెట్టుబడిదారీ వ్యవసాయవిధానం ఆధారపడివుంది. ఈ వ్యవసాయపద్ధతియొక్క అభివృద్ధికి పెద్ద అభ్యంతరం రాజకీయైక్యత లేకపోవడమే. రైతాంగాన్ని అణిచి పెట్టుతూ, దాసత్వకాలంనాటి చిహ్నాలింకా దేశంలో మాసిపోలేదు. అందుచేతనే రైతాంగం ఆర్థికవిషయాల్లో ఎన్ని పేచీలున్నా, రాజకీయంగా ఏకీభావాన్నేప్రదర్శించేరు. కాని, ఆవర్గంయొక్క పరిస్థితుల్నిపట్టి,

వారిలో కేంద్రీకృత కార్యాచరణం కాని, సమిష్టి కార్యాచరణంగాని అసంభవం అయిపోయింది. వారిని రంగంలో నడిపించగల మహాకవర్గం యొక్క ఆవశ్యకత ఏర్పడింది.

ఫ్రాన్సులో జమీందార్లు కేవలం పరాధీన జీవితం గడిపేవారు. స్వయంగా వేలువంచి ఒక్కపనీచేసుకొనేవారుకారు. కాని, ప్రష్యను జంకరు—(కులీనుడు-జమీందారు) తరహాయేవేరు. అతడు మంచి వ్యాపారి. తన అధికారాన్నీ, ఆదాయాన్నీ జాగ్రత్తగా కాపాడుకోవాలనే ఆకాంక్షగలవాడు. అయినప్పటికీ జర్మనీలో బూర్జువా విప్లవం విజయం పొందడానికి మంచి సావకాశాలున్నాయి. జాతీయైక్యత విషయంలోనేం; దాసత్వాన్నీ - జమీందార్ల ప్రత్యేక సౌకర్యాల్ని రద్దు చెయ్యడం విషయంలో అయితేనేం, జర్మను బూర్జువావర్గానికి, నగరాలలోనూ, పల్లెలలోనూ కూడా శ్రామికులూ - పెట్టీబూర్జువాలూ తోడ్పడుతున్నారు.

దేశంలో చిన్న చిన్న పరిశ్రమలసంఖ్య అప్పటికింకా చాలా హెచ్చుగావుంది. చేతిపనివారి సంఖ్యా చాలా అధికంగావుంది. 1846 నాటికి దేశంలో పరిశ్రమల స్వంతదారుల సంఖ్య 4,57,000. వారి క్రింద అద్దెకి పనిచేసేవారి సంఖ్య 3,85,000 మాత్రమే. అంటే స్వతంత్రంగా పరిశ్రమలు పెట్టుకొని జీవించేవారి సంఖ్య దేశంలో అధికంగా వుందన్న మాట. కాని, కొన్ని జిల్లాలలో (సైలీషియా - శాగ్జనీ) చిన్నపరిశ్రమల్ని త్రోసేసి పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానం వాని స్థానం ఆక్రమించుకుంటూ వుంది. ఆ స్వంతపరిశ్రమలవారంతా గృహపారిశ్రామికులుగా మార్చి వెయ్యబడి పెట్టుబడిదారులచేత తరిమివేయబడుతూన్నారు. ఉదాహరణకి సైలీషియాలోని నేతపారిశ్రామికుల్ని తీసుకోవచ్చును. ఆర్థికంగా బాగా అభివృద్ధికివచ్చిన రైన్ రాష్ట్రంలో పెద్ద పెద్ద ఫ్యాక్టరీలే బయలుదేరి

నాయి. ప్రష్యాలో 1846 నాటికి 5,51,000 మంది కూలీలతో 79,000 పరిశ్రమలు పనిచేస్తూన్నాయి. "ట్సోల్ ఫెరిన్" సరిహద్దులలోనే 7½ లక్షల కదుళ్ళతో 313 నూలుయంత్రాలు పనిచేస్తూన్నాయి. ఉన్ని - నారవడికే కదుళ్లు 4,97,000 ఉన్నాయి. ప్రష్యాలోనే. మగ్గాలు 1,39,000 ఉన్నాయి. వాటిలో 71 వేల మగ్గాలు శ్రామికుల ఇండ్లలోనే వున్నాయి. ఆ ఏడాది ప్రష్యాలో 21 వేల గుర్రపుశక్తిగల 1139 ఆవిరి యంత్రాలు పని చేస్తూన్నాయి. వాటిలో అధికభాగం గనులలోనే వుపయోగపడుతూన్నాయి. ఈ యంత్రాలవలనా, ఫ్యాక్టరీలవలనా అంత హెచ్చుసరుకు తయారవడం లేదు. 20 వ శతాబ్దం ఆరంభంనాటి మిల్లులలో 4 నేతమిల్లులు ఎంతపని చెయ్యగలిగేయో 1848 నాటి 313 మిల్లులూకలిసి అంతే సరుకు తయారు చెయ్యగలిగేయి. అయినా 1789 లో ఫ్రాన్సులో కంటె ఆనాటికి జర్మనీలో పరిశ్రమలసంఖ్య అధికమే. విశేషోత్పత్తీ; పెద్దతరహా వ్యాపారమూ; జంకర్లని ఓడించడానికి తగినంత ప్రాబల్యం పొందేయి.

బూర్జువావర్గం తన కార్యక్రమం సాగించడానికి ఏల ఆలస్యం చేసిందో ఈపారిశ్రామికాభివృద్ధిక్రమమే తెల్పుతూంది. 1789 నాటికే ఫ్రాన్సులో పరిశ్రమల స్వంతదారులకీ, కూలీలకీ; స్వంతదారులకీ - పెట్టుబడిదారులకీ మధ్య పోరాటాలు విశేషంగా జరిగేయి. కాని కూలీలకీ పెట్టుబడిదారులకీ మధ్య ప్రత్యక్షపోరాటాలు ఏమీ జరగలేదు కాని, జర్మనీలో ఆలాగకాదు. 1840 నాటికే శ్రామికులకీ పెట్టుబడిదారులకి పోరాటాలు బలిసేయి. 1844 లో సైలీషియాలో నేతపనివారు తిరుగుబాటుచేసేరు. దానిని అణచడానికి ప్రభుత్వసహాయంకూడా తీసుకోబడింది. పెద్దపరిశ్రమనుంచి రక్షణకోరే పెట్టీబూర్జువాకీ - పారిశ్రామిక బూర్జువావర్గానికీ మధ్య చాలా తీవ్రపరిస్థితులు ఏర్పడినాయి. స్వతం

త్రంగా జీవించే చిన్న ఉత్పత్తిదారులు నామరూపాలులేకుండా త్రోసి వెయ్యబడ్డారు. ఫలితంగా విదేశాలకి వలసపోయేవారి సంఖ్య పెరిగింది. 1800-30 మధ్య అమెరికాకి వలసపోయినవారి సంఖ్య 1,50,000 మాత్రమే. కాని, 1830-40 ల మధ్య 4,30,000 మంది వలసపోయేరు.

విప్లవం వలన తమకి లాభాలున్నాయని జర్మను ధనికవర్గం ఎరుగును. కాని పక్కదేశాలలో జరుగుతూన్న వర్గపోరాటాలు చూసేటప్పటికి బెదరిపోయేరు. ఇంగ్లండులోని ఛార్టిస్టుల ఆందోళన; ఫ్రాన్సులో సోషలిజం - కమ్యూనిజముల అభివృద్ధీ - కార్మికవర్గం యొక్క జననం చూసేటప్పటికి ధనికవర్గం గుండె లవిసిపోయేయి. వారికి అధికారం కావాలి. కాని, అది శాంతియుతంగా, రాజీపద్ధతులమీద లాగాలని ప్రయత్నం. కాని, 1848 ఫిబ్రవరిలో పారిస్ శ్రామికులు పొందిన విజయం ఒక హెచ్చరికలా పనిచేసింది. బెర్లిన్ ప్రజాసామాన్యం ఆహెచ్చరిక నందుకుంది. వారి విప్లవ కార్యాచరణతో రాజ్యాంగాధికారం ఒక్కమారుగా ధనికవర్గం చేతులలో వచ్చిపడింది.

నైరృతి జర్మనీలో విప్లవోద్యమం 1848 మార్చి నెలలోనే ప్రారంభం అయింది. కొలోన్ మాదిరి పారిశ్రామిక కేంద్రాలలోని శ్రామికులు బాగా చైతన్యం కలవారు కావడంచేత తమ కోరికలతో ముందుకి వచ్చేరు. మార్చి 13 న వియన్నాలో తిరుగుబాటు వచ్చింది. నెగ్గింది కూడా. ఆరోజుననే బెర్లినులో శ్రామికులకీ - సైనికులకీ మధ్య సంఘర్షణలు జరిగినాయి. బారికేడ్లు నిర్మించబడినాయి. చివరికి శ్రామికులు మార్చి 18 న విజయం పొందేరు.

"స్వాభావికంగా ధనికవర్గంచేత వెనక్కి నెట్టబడుతూవుండే

శ్రామికవర్గం ముందుకురికింది. తనశక్తిని గుర్తించి, పోరాడి, విజయం సంపాదించింది."

ఏంజిల్సు "రివల్యూషన్ అండ్ కౌంటర్-రివల్యూషన్"

రాజు తన సేనల్ని పట్టణాలనుంచి తొలగించక తప్పిందికాదు. నూతన రాజ్యాంగవిధానం ఏర్పరచడానికి అంగీకరించేడు. రైన్ రాష్ట్రంలో కల్లా పేరుపడ్డ ధనవంతులు కాంప్‌హాసేన్, హన్సిమాన్, అనే వారి నాయకత్వాన మంత్రాంగం ఏర్పరచడానికి అంగీకరించేడు.

విప్లవం ఆరంభించేనాటికి మార్క్సు బ్రస్సెల్సునగరంలో 'న్యూ-రేనిష్ జీటంగ్' అనే పత్రిక నడుపుతూండేవాడు. (1848 జూ॥ 1 నుంచి 1849 మే 19 వరకూ), విప్లవంరాగానే బూర్జువావర్గం యొక్క మోసకారితనమూ; పెట్టీబూర్జువావర్గం యొక్క చేతకానితనమూ కారణంగా "రెనిష్ డెమాక్రటిక్ - అసోసియేషను" యొక్క జిల్లాకమిటీ సభ్యత్వానికి రాజీనామానిచ్చేసి పారిస్ మీదుగా కొలోన్ వచ్చేసేడు. 1848 అక్టోబరులో 'కొలోన్ కార్మికసంఘాని'కి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. "ఈప్రజాతంత్ర విప్లవంలో కలిగిన అనుభవాలవలననే శ్రామికవర్గానికి ప్రత్యేకనిర్మాణమూ, ప్రత్యేకపార్టీ వుండాలనే నిర్ణయానికి మార్క్సు వచ్చేడు" (లెనిన్)

బూర్జువా విప్లవాన్ని పూర్తిచేయాలంటే శ్రామికవర్గం ప్రత్యేకంగా సంఘటితం అయి విప్లవాన్ని ముందుకి సాగించి శ్రామికవర్గ విప్లవంగా మార్చవలసి యుంటుందనే విషయం 1848 విప్లవం వల్ల నేర్చుకోవాలని మార్క్సు కమ్యూనిస్టులీగు కిచ్చిన ఉపన్యాసంలో స్పష్టంగాచెప్పేడు. (ఈపుస్తకం 'కమ్యూనిస్టులతో—' అనే పేరున తెలుగులో విశ్వసాహిత్యమాలచే ప్రకటించబడింది.)

"ఫిబ్రవరి విప్లవఫలితంగా అయాచితంగా రాజ్యాంగాధికారం చేత చిక్కినందుకు జర్మను బూర్జువావర్గం సంతోషించింది. కాని, వారెప్పుడూ అనుకొనివుండని, అంగీకరించలేని పరిస్థితులు తటస్థపడి, వాటికి అనుగుణంగా పరిపాలన సాగించవలసి వచ్చింది. పాపం, దానితో వారి ఎత్తులన్నీ తల్లక్రిందులయిపోయాయి."

—న్యూ రేనిష్ జీటన్గ్ : ii, 12, 1848.

ప్రష్యాలోనూ, ఆస్ట్రియాలోనూ, ఇతర జర్మను రాష్ట్రాలలోనూ మార్చినెలలో విప్లవాలువచ్చి, రాజ్యాంగాధికారం ఉదారధనికవర్గంచేతిలో పడింది. పూర్వపు రాజ్యాంగవిధానాన్నీ, జమీందారీ సంబంధాలనీ నాశనం చేసే అవకాశం కలిగింది. ఇక్కడ గమనించవలసిన విషయం ఒకటుంది. ఫ్రెంచి ధనికవర్గపు ఎత్తుగడలకీ, జర్మను ధనికవర్గపు ఎత్తుగడలకీ, చాలా తేడావుంది. ఫ్రాన్సులో 1789 నాడే రాజకుటుంబం త్రోసివెయ్యబడింది. 1848 లో ప్రజల వొత్తిడివలన రాజరికం రద్దుచేయబడి రిపబ్లికు ప్రకటించబడింది. కాని, జర్మనీలో ఏ రాష్ట్రంలోనూ కూడా ధనికవర్గం రాజరికాన్ని త్రోసివెయ్యలేదు. ఆఖరుకి ప్రష్యాలో కూడా అంతే. పూర్వ ప్రభుత్వకూటం ఎలావున్నది అలాగే వుంచివేయబడింది. బెర్లిన్ వీధులలో బారికేడ్లమాటున శ్రామికవర్గం ఇంకా పోరాటం చేస్తూనేవుంది. అప్పుడే ధనికవర్గం శ్రామికులమీద దండయాత్రలకి రాజకుటుంబం వుండాలనే వారితో సంధి చేసుకుంది. ఒక్క మిలిటరీ వుద్యోగికాని, ఒక్క సివిలు వుద్యోగికాని, తొలగించబడలేదు. జమీందారీ పరిపాలనా విధానాన్ని రద్దుచెయ్యగల ధైర్యం ధనికవర్గానికి లేకపోయింది. విప్లవారంభంనుంచీ కూడా వారు పారిసు పరిస్థితులు - శ్రామి

కుల స్వతంత్రకార్యాచరణ గమనించి కంగారుపడిపోతూన్నారు. ప్రజా విప్లవం స్వంత ఆస్తి సంబంధాలమీదనే దెబ్బతీస్తుందని వారు భయపడ్డారు.

న్యూ - రేనీష్ - జీటన్గ్‌లో వ్రాస్తూ, మార్క్స్ - "జర్మన్ ధనిక వర్గం తన వెనక నొక వర్గం వుండడాన్నేకాకుండా ఎదురుగా శత్రుమయమైన యూరపును కూడా చూసింది."—అన్నాడు.

మంత్రాంగంలో స్థానాలు సంపాదించుకున్నాక బూర్జువా నాయకులు తమ్ము రాజకుటుంబ రక్షకులుగా ప్రకటించుకున్నారు. శక్తివున్నంత వరకూ, రాజరికం నిలవబెట్టేటందుకు పోరాడేరు. వారు వెంటనే విప్లవ వ్యతిరేకవర్గాలతో సంధిచేసుకున్నారు. విప్లవోద్యమం ఇంకా తీవ్రం అవుతుందేమోననే భయంతో అంతవరకూ తమకు బాసటగావున్న రైతాంగపు సహాయాన్ని త్రోసిపుచ్చేరు.

"ప్రష్యను రైతాంగం మీద జమీందారీ విధానపు ఒత్తిడి అంత అధికముగా లేదు. వీరుకూడా ఆస్ట్రియన్ రైతాంగం మాదిరిగానే విప్లవం వలన లాభమే పొందేరు. వారిని అణిచి పెడుతూన్న జమీందారీ నిర్బంధాలన్నీ విచ్ఛిన్నం అయినాయి. కాని, ఇక్కడ, వారితో ఎంతో కాలంనుంచి కలిసి మెలిసివున్న మధ్య తరగతి ప్రజ వారికి ఎదురు తిరిగింది....అందుచేత మూడు నెలలపాటు స్వాతంత్ర్యం అనుభవించేక, అంతవరకూ జమీందారీ విధానానికి వ్యతిరేకులుగావున్న బూర్జువావర్గమే వారి కెదురు తిరిగి, ఎంతో రక్తం ప్రవహింపచేసి, ఎందరినో ఉరి తీయించి, మళ్ళీ జమీందారీ రాజ్యాంగాన్ని స్థాపించింది."

"రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్."

'పెట్టిపని' వెంటనే రద్దుచేయబడాలనే బిల్లు 1848 ఆగస్టులో శాసనసభచేత తిరస్కరించబడినది.

ప్రజలు బారికేడ్ పోరాటంలో విజయం పొందిన వెంటనే ధనిక వర్గం శ్రామికులకి ఎదురు తిరిగింది. వారికి గల వోటు అధికారం రద్దు చేసి వెయ్యబడింది. వారిని నిరాయుధులుగా చేసేసేరు. 1848 జూన్ నెలలో శ్రామికులు ఆయుధాలకోసం ఆయుధాగారాన్ని ముట్టడించేరు. కాని ఆ ప్రయత్నాలు సివిలుగార్డులూ, ప్రభుత్వదళాలూ కలిసి సాగకుండా చేసి ఓడించేయి. అంతకంతకి జర్మను బూర్జువావర్గం మితవాదపథంలో పడిపోయింది. వీరిని గురించి మార్క్సు 15-12-1848 ఈలాగ వ్రాసేడు.

"బూర్జువావర్గం కోసం రాజరికం రాజబంధువుల్ని వొదులుకుంది. రాజరికం కోసం బూర్జువావర్గం శ్రామికుల్ని వొదులుకుంది."

కాని, ధనికవర్గ ఉదారవాదులు వేసుకున్న లెక్కలన్నీ తప్పు. ప్రజల పక్షాన్నుంచి తప్పించేటందుకే రాజరికం బూర్జువావర్గంతో సంధి చేసుకుంది. ఆసంధితోనే మళ్ళా పూర్వపు నిరంకుశవిధానం స్థాపించే టందుకు తగిన మార్గం సరిచేసుకుంది. మధ్య ధనికవర్గం బోల్తాపడింది.

పారిస్‌లోని విప్లవాన్ని చూసి కాంప్ హౌసేన్, హన్సిమన్‌లు భయపడి పోయినట్టుగానే, 1918 విప్లవంలో అధికారంలోకి వచ్చిన సోషల్ డెమాక్రాట్లు ప్రపంచ విప్లవానికీ, సోవియటు ప్రభుత్వ నిర్మాణానికీ అదిరిపోయేరు. వారి బారినుంచి పెట్టుబడిదారీవిధానాన్ని రక్షించే టందుకు శాయశక్తులా పాటుపడ్డారు. బూర్జువాలతో రాజీ చేసుకున్నారు. సైనికోద్యోగులందరినీ వెనుకటివారినే నిలిపేరు. రాజ్యాంగచక్రం అంతా

పూర్వపు ఉద్యోగుల చేతులలోనే వదిలివెయ్యబడింది. 1848 లోని ఉదార ధనికవర్గం మాదిరిగానే 1918 నాటి సోషల్ డెమాక్రాట్లూ, పూర్వపు విధానాన్ని రద్దుచెయ్యడానికి బదులు, పూర్వాధికారవర్గాల్ని రక్షించే టందుకే మహాశ్రమపడ్డాడు. 1848 వసంతకాలంలో బూర్జువా ఉదారవాదులచేత రక్షించబడిన 'హోహెన్ జొల్లెరన్' రాజకుటుంబం ఆ ఏడాదే శీతాకాలంలో వారిని త్రోసివేసింది. అదే మాదిరిగా 1918 లో ధనికవర్గం సోషల్ డెమాక్రాట్ల ఉద్యమంవలన రక్షించబడింది. మళ్ళా సత్తువచేర్చుకొని వారినే త్రోసేసింది. ఈరెండు ఘట్టాలలోను కూడా రాజీవిధానం విప్లవపరాజయానికే తోడ్పడింది. 1848 లో రాజరికం స్థాపించడానికీ, 1918 లో బూర్జువావర్గం యొక్క రాజ్యాధికారం నిలపడానికీ మాత్రమే పనికి వచ్చింది.

జర్మను జాతీయైక్యతాపోరాటానికి దారితీసినది ప్రష్యను ధనికవర్గం కాదు ఆ ఏకీభావానికి ఇదివరకే ఎన్నో విధానాలు ఆలోచనలో వున్నాయి. ఒక్క ఆస్ట్రియాను మినహాయించి మిగిలిన రాష్ట్రాలన్నింటినీ "చిన్నజర్మనీ" అనే పేరుతో ప్రష్యా నాయకత్వం క్రింద ఏకం చెయ్యాలనేది ఒక ఉద్దేశ్యం. ఇంక మార్క్స - ఏంజిల్సులూ ఇతర డెమాక్రాట్లూ ప్రష్యా - ఆస్ట్రియాలతో సహా 'విశాల జర్మను ప్రజాస్వామ్యం' స్థాపించబడాలని కోరుతూండేవారు, ఆర్థిక - రాజకీయైక్యతా స్థాపనకి ముందు మార్చి విప్లవం పూర్తికావాలి. ప్రష్యను రాజరికమూ - జమీందార్ల అధికారాలూకూడా రద్దు చెయ్యబడాలి. దక్షిణ రాష్ట్రాలలోని పెట్టీబూర్జువా డెమాక్రాట్లు ఆదినుంచీ ఫెడరేటివ్ రిపబ్లికు కావాలనే ధోరణి చూపుతూన్నారు - ప్రష్యారాజరికాన్ని వారూ అంగీకరించరు. కాని, జమీందారీ ప్రభుత్వచిహ్నాలు కలిగివుండే చిన్నచిన్న ఎస్టేట్లు

వుండాలని వారి ఆశయం. ఇంక ప్రష్యను బూర్జువాజీ రాజరికంతో స్నేహం రద్దుచేసుకొని, జాతీయైక్యతా పోరాటానికి నాయకత్వం వహించడానికి అంగీకరించలేదు.

1848 మార్చినెలలో దక్షిణరాష్ట్రాలవారు ఫ్రాంక్‌ఫర్టులో మొట్ట మొదటి పార్లమెంటు సమావేశపరిచేరు. నేషనల్ ఎస్సెంబ్లీ సమావేశ పరచాలని ఆనాడే స్థిరపరచబడింది. మే 18 న నేషనల్ ఎస్సెంబ్లీ కూడింది. ఈ ఫ్రాంక్‌ఫర్టు నేషనల్ ఎస్సెంబ్లీలో బూర్జువా మితవాదులచే పైచెయ్యి అయింది. మార్క్స్—ఏంజిల్సులు "న్యూ రేనీష్ జీటన్గ్"లో ఈ అస్సెంబ్లీయొక్క కార్యక్రమాన్ని అతినిశితంగా ఖండించుతూండే వారు. దేశంలోని విప్లవశక్తుల నన్నిటినీ త్వరత్వరగా కూడకట్టుకుని రాజ్యాంగాధికారం చేత పట్టుకునే దానికి బదులు వారు ముస్ముందు ప్రణాళికను తయారు చెయ్యబూనుకున్నారు. కార్యక్రమాన్ని గురించి ఆలోచించడానికే ఎస్సెంబ్లీ ఎన్నోమారులు సమావేశం అయి కాలం వ్యర్థంచేసింది. ఫ్రాంక్‌ఫర్టు ఎసెంబ్లీ చేసిన పనులు చూస్తేనే బూర్జువా ఉదారవాద రాజకీయనాయకుల అసమర్థత స్పష్టం అయిపోతుంది. విప్లవ ప్రతికూలురు తమకుగల సావకాశాలన్నీ కూర్చుకుని ఎదురుదెబ్బ తియ్యడానికి తయారవుతూంటే, వీరు ప్రణాళికలోని సూత్రాలతో [illegible] పట్టి పెద్ద పెద్ద ఉపన్యాసాలు సాగిస్తున్నారు. పైపెచ్చు ఈ నేషనల్ ఎస్సెంబ్లీకూడా ముఖ్యంగా ప్రజోద్యమం పేరు వినేటంతకి బెదిరి బెదిరి చూస్తూంది. సాయుధులయిన ప్రజలసహాయం కావాలని ఈ ఎస్సెంబ్లీ ఒక్కమారూ నోరువిడిచి అడగలేదు. ఒక్క రాజకుటుంబాన్నైనా వాటి తొలగించ పూనుకోలేదు. వేరువేరు రాష్ట్రాలమధ్య ఐక్యత [illegible] కయినా వీరు చేసింది ఏమీలేదు. బెర్లినులోనూ, వియన్నాలోనూ [illegible]

అసెంబ్లీలు విచ్ఛిన్నం చెయ్యబడిన తర్వాతకూడా ఫ్రాంక్‌ఫర్టు అసెంబ్లీ ప్రణాళికను గురించి చర్చలు సాగిస్తూనేవుంది.

## ఆస్ట్రియాలో—

ప్రష్యాలో సమస్యలన్నిటికీ కేంద్రం జాతీయైక్యత. కాని, ఆస్ట్రియా వ్యవహారాలువేరు. దేశంలో అల్పసంఖ్యాకజాతు లధికం. హంగరియనులు, ఇటాలియనులు, దక్షిణస్లావులు, పోలిష్‌జాతి, జెక్‌లు మొదలయినవారంతా ఆస్ట్రియాలో వున్నారు. ప్రష్యాలోకంటేనూ బాగా వేళ్ళు బారియున్న జమీందారీ సంబంధాల్ని రద్దు చెయ్యడం - వేరువేరుజాతుల్ని విడదీసి, వారికి స్వాతంత్ర్యమో, రాష్ట్రీయస్వాతంత్ర్యమో ఇవ్వడం—ఇవీ ఆస్ట్రియాలోని ప్రధాన సమస్యలు. బూర్జువా విప్లవోద్యమానికి పట్టుకొమ్మలుగా వుండవలసిన ఈ రెండు దేశాలలోని సమస్యలూ ఒకటి కాకపోవడమే విప్లవోద్యమానికి పెద్ద అడ్డంకి అయిపోయింది.

వియన్నాలో విప్లవం బెర్లినులో కంటేనూ విజృంభణగావచ్చింది. మొట్టమొదట మార్చినెలలో విప్లవం వచ్చింది. మెటర్నిక్ తరిమివెయ్యబడ్డాడు. (ఈ మెటర్నిక్ యూరపులోని విప్లవ వ్యతిరేకవర్గాలనాయకుడు) పళ్ళీ మేనెలలో సార్వజనిక వోటుహక్కుకోసం సాగించిన పోరాటంలో ఒకమాటూ, విద్యార్థిసంఘాల్ని నిరాయుధుల్ని చెయ్యపూనినప్పుడొకమాటూ రెండు తిరుగుబాట్లు వచ్చేయి. ఈ తిరుగుబాట్లలో నాయకత్వం పెట్టీబూర్జువా అతివాదులది. శ్రామికులు వీరికి పూర్తిగా తోడ్పాటు ఇచ్చేరు. మే 25 న జరిగిన విప్లవం విజయం పొందేక సార్వజనికవోటు హక్కు ఇయ్యబడింది. చక్రవర్తి, దర్బారీలతోసహా వియన్నా వదలి పారిపోయేడు.

జూన్ నెలలో పారిస్ శ్రామికవర్గం ఓడిపోవడమే ఆరంభం విప్లవోద్యమం తిరుగుముఖం పట్టడానికి. జమీందారీశక్తుల ప్రతిక్రియ ఆరంభం అయింది.

మొట్టమొదటి దెబ్బనుంచి కాస్త కోలుకున్నాక ఆస్ట్రియను ర... రికం ముందుగా బూర్జువా మితవాదులతో సంధిచేసుకుని కాలూ-చెయ్యి కూడదీసుకోసాగింది. దేశంలో జాతిభేదాలు ఎక్కువకాగా వాటిని పు... గొల్పి తన వునికి నిలుపుకుందుకు ప్రయత్నించసాగింది. బొహీమియా... తల ఎత్తిన స్లావ్ జాతీయోద్యమాన్ని అణచడానికి హంగరియన్లనీ—జర్మనులనీ సహాయం తెచ్చుకుంది. ఆనాటికింకా ఇటలీలో ఏక ప్రభుత్వాధికారం ఏర్పడలేదు. "లంబార్డీ" రాష్ట్రం ఆస్ట్రియా అధీనంలో వుండేది. అచ్చటి ఇటాలియను జాతీయోద్యమం మీదికి స్లావుల్నీ—హంగరియన్లనీ పురిగొల్పేరు. హంగరియను తిరుగుబాటునీ, వియన్నా తిరుగుబాటునీ అణిచి వెయ్యడానికి బలీయమైన స్లావు సైనికదళాలు ఉపయోగించబడ్డాయి.

ఒక్క పోలండులో మినహా మిగిలిన స్లావు రాష్ట్రాలలో ఆనాటికి పెట్టుబడిదారీవిధానం అంతగా వృద్ధిచెందలేదు. ఆర్థికంగానూ, రాజకీయంగానూ కూడా వెనకబడివున్న ఈ స్లావుజాతిని ప్రభుత్వం ఉపయోగించుకో దలచింది. దీనికి మూలం స్లావు రైతుల్ని విజాతీయ భూస్వాములమీదికి రెచ్చగొట్టడం. ఈ కారణంచేతనే 1848 లో ఒక్క పోలులు మినహా మిగిలిన స్లావుజాతి ప్రజలు విప్లవవ్యతిరేక పక్షంలోకి పోయి చేరేరు. వారి సహాయంతో ఆస్ట్రియా చక్రవర్తి బూర్జువా విప్లవాన్నీ; అభివృద్ధి పొందిన ప్రజల— ముఖ్యంగా హంగేరియనుల జాతీయోద్యమాలనీ నాశనము చేసివేయగలిగేడు.

వేరు వేరు జాతులవారు తమ తమ జాతీయస్వాతంత్ర్యం కొరకై ఆరంభించిన విప్లవోద్యమాలకి మార్క్స్ - ఏంజిల్సులు హృదయ పూర్వకంగా సహాయంచేసేరు. పోలండు, హంగరీ జాతీయ స్వాతంత్ర్యోద్యమాలకి వారు పూర్తి హెచ్చరిక నిచ్చేరు. 1848 లో దక్షిణ స్లావులు విప్లవ వ్యతిరేకపక్షంలోచేరి జర్మను విప్లవాన్ని బజారుకి ఈడ్చేరని వారు నొక్కిచెప్పేరు.

"దేశంలో విప్లవం వ్యాపించివున్నపుడూ, ఇతరులతో పోరాటంలో వున్నప్పుడూ, దేశద్రోహుల్ని భరించడం కష్టం."

—ఏంజిల్సు, "రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్"

ఈ విషయంలో మార్క్స్, ఏంజిల్సులు కరడుకట్టిన జాతీయవాద దృక్పథాన్నిగాని; స్లావు వ్యతిరేకతనిగాని అవలంబించేరనుకోవడం కేవలం పొరపాటు. పోలండుయొక్క రక్షణవిషయమై వారు చూపిన ఆవేశమే వారి నిజభావాలకి నిదర్శనం. వారికి కావలసినదల్లా విప్లవం యొక్క విజయం. 1848 లో దక్షిణస్లావులు విప్లవ వ్యతిరేకులకి పెట్టని కోటలు. జాతీయోద్యమాన్నీ, విప్లవోద్యమాన్నీ ధ్వంసంచేయడంలో విశేషంగా సహాయపడ్డారు. అందుచేతనే మార్క్స్ - ఏంజిల్సులు వారి చర్యల్ని ఖండించేరు.

అక్టోబరునాటికి పరిస్థితులు తీవ్రరూపం ధరించేయి. హంగేరియను విప్లవకారుల్ని నాశనం చెయ్యడానికి చక్రవర్తి వియన్నానుంచి సేనలు పంపబోతూంటే అచ్చటి డెమాక్రాటిక్ వర్గాలవారు (విద్యార్థులూ, శ్రామికులూ, మధ్యతరగతులూ) అడ్డం పెట్టేరు. అక్టోబరు 6 న వియన్నాలో మరో తిరుగుబాటు వచ్చింది. మళ్ళీ చక్రవర్తి పరారయ్యేడు. కాని, మూడువారాలలోపుగానే అరవై వేల సైన్యం కూర్చుకున్నాడు. వారిలో

అధికభాగం స్లావు ప్రజలే. దీనికి తోడు వియన్నాలోని విప్లవకరవర్గాలలో కూడా ఐక్యత లేకపోయింది. బూర్జువావర్గానికి శ్రామికులంటే హడలు పట్టుకుంది. విప్లవాన్ని నడుపుతూన్న మధ్యవర్గానికి కూడా శ్రామికుల మీద నమ్మకంలేదు. హంగేరియన్ సేనలు సరియైన వేళకి తోడ్పాటు రాలేదు. విజాతీయుల సేనల్ని సాయం పిలవడానికి ధనికవర్గానికే గుండెలులేవు. పైగా, జర్మనీలోని డెమాక్రాట్లుకూడా వీరికి విశేష సహాయం ఇయ్యలేదు.

ఆఖరు క్షణందాకా వియన్నావాసులు తీవ్రంగా ఎదిరించి నిలబడ్డారు.

"వియన్నా కమాండింగ్ ఆఫీసరు 'బెమ్'. అనేక స్థానాలలో 'ఒక్క మనిషి మిగిలినంతవరకూ రక్షించండి' అంటూ దళాల్ని నిలిపాడు. ఇంచుమించు అన్ని ప్రదేశాలలోనూ ఈ యాజ్ఞలు అక్షరశః పాలించబడ్డాయి. కాని, చివరకి పశుబలమే గెలిచింది. చక్రవర్తి ఫిరంగి కాల్పులకి ఒకదానివెనక నొకటిగా బ్యారికేడ్లు తుడిచిపెట్టుకుపోయినాయి. రెండోరోజు సాయంకాలానికి పాతకోటదిబ్బలకి ఎదుటివరుస యిళ్ళన్నీ క్రోటులచేత ఆక్రమించబడినాయి."

—"రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్."

నవంబర్ 1 న వియన్నా, శత్రువుల చేజిక్కింది.

## జర్మనీలో విప్లవంయొక్క ఓటమి.

జూన్ నెలలో పారిస్ తిరుగుబాటుయొక్క ఓటమిలాగే, వియన్నా పతనంకూడా విప్లవోద్యమానికి తీవ్రాఘాతం కలుగచేసింది. జర్మనీ అంతటిలోనూ, ముఖ్యంగా ప్రష్యాలో-విప్లవవ్యతిరేకుల దండయాత్రలు

ఆరంభం అయినాయి. 1848 నవంబరు 10 వ తేదీన ప్రష్యను సేనలు బెర్లిన్‌లో అడుగు పెట్టేయి. అసెంబ్లీని 'బ్రాండెన్‌బర్గ్' అనే చిన్న నగరానికి మార్చమని ఆజ్ఞలుజారీచెయ్యబడినాయి. బూర్జువావర్గం కొద్ది పాటి నిరోధం ప్రదర్శించింది. కాని, దానివలన పనిజరగదు. ఆఖరుకి డిసెంబరు 5 వ తేదీన ప్రష్యన్ 'నేషనలు ఎసెంబ్లీ' రద్దు చెయ్యబడి, పూర్వపు ప్రభుత్వం స్థిరపరచబడింది.

1849 వసంతర్తువులో జర్మను విప్లవోద్యమం తిరిగి తలఎత్తింది. హంగరీలో తిరుగుబాట్లు అధికం అయినాయి. వాటిని ప్రభుత్వం స్వయంగా అణచలేకపోయింది. రష్యనుసేనల సహాయం కోరబడింది. వారి సహాయంతో అది అణిచి వెయ్యబడింది. శాక్సనీలోనూ, ఇంకా ఇతర దక్షిణ రాష్ట్రాలలోనూ తిరుగుబాట్లు పెట్టీబూర్జువాల నాయకత్వాన తలయెత్తేయి. ఫ్రాంక్‌ఫర్టు ఎసెంబ్లీ ఇంతకాలమూ కుస్తీపట్టి నిర్ణయించిన రాజ్యాంగ విధానం కొరకు జరిగిన పోరాటాలివి. (1849 ఏప్రియలు) కాని, ఆరంభంలోనే నాయకుల పస తెలిసిపోయింది. పెట్టీబూర్జువా మితవాదులు సాయుధ విప్లవాన్ని నడిపించలేరని తేలిపోయింది. ఈ ఘట్టాన్నే ఏంజిల్సు ఎత్తుకున్నాడు.

"ప్రారంభించిన పనివలన కలిగే ఫలితాన్ని ఎదుర్కొడానికి సిద్ధంగా లేకపోతే ఎన్నడూ తిరుగుబాటుతో చెలగాటం ఆడవద్దు..., ఒక మారు తిరుగుబాటు దారుడవుగా జీవితం ఆరంభించేవా, దృఢనిశ్చయంతో, ఎప్పుడూ దెబ్బతీసే ఎత్తులోనేవుండు. ఆత్మరక్షణం అనేది సాయుధవిప్లవానికి వినాశకరం. ఆప్రయత్నంలోనేవుంటే శత్రువుపై దాడి ప్రారంభించేటప్పటికే విప్లవం విధ్వంసం అయిపోతుంది.

—"రివల్యూషన్ అండ్ కౌంటర్-రివల్యూషన్"

కాని పెట్టీబూర్జువాలకి ఆపాటి స్థైర్యంలేదు. ఏమి చెయ్యడానికీ తోచక కంగారుపడ్డారు. తమకు దొరికిన అవకాశాన్ని వినియోగించుకో లేకపోయేరు. ఫలితంగా విప్లవ వ్యతిరేకపక్షాలన్నీ ఏకం కావడానికి వీలు చిక్కి, తిరుగుబాటు అణిచి వెయ్యబడింది.

విప్లవం ఓడిపోవడానికి ప్రధానకారణం దానిని నడిపించగల వర్గం ఏదీ లేకపోవడమే. పైగా ఆర్థికబలంగల జమీందారీకుటుంబాల తోడ్పాటు శతృవులకి పూర్తిగావుంది.

జర్మను ధనికవర్గం జర్మను శ్రామికులకంటె - పారిస్ శ్రామికుల స్వతంత్రకార్యాచరణకే ఎక్కువ భయపడింది. అన్నిచోట్లా జరిగినట్లు గానే ఇక్కడకూడా ధనికవర్గం విప్లవరంగం వదిలిపెట్టేసింది. విప్లవం వలన తమకే మేలుకలిగే స్థితి ఏర్పడివున్నా వారు ధైర్యం చెయ్యలేక పోయేరు.

ఫ్రెంచి మహావిప్లవంలో పాల్గొన్నట్లుగా రైతాంగం ఇచ్చటి పోరాటాలు వేనిలోనూ కలుగచేసికోలేదు. కారణం జర్మనీలో కలిగిన పారిశ్రామికాభివృద్ధివలన పల్లెటిప్రాంతాలలోని జమీందారీ చిహ్నాలు చాల వరకు మాసిపోయినాయి కాని, అంతకంటేనూ ముఖ్యవిషయం రైతాంగానికి నాయకత్వం వహించి నడిపించగల దార్ఢ్యం శ్రామికవర్గా నికేలేదు. ప్రారంభంనుంచీ ధనికవర్గం రైతాంగాన్ని మోసగిస్తూనేవుంది. జమీంధారీ విధానం 1848 జర్మనీలోకన్న, 1905 రష్యాలోనే హెచ్చుగా వుంది. కాని అచ్చటి శ్రామికులు పల్లెటూళ్ళని కదల్చగలిగేరు. అందు చేతనే రైతు విప్లవం వచ్చింది.

1848–49 లలో ఆస్ట్రియాలోని ముఖ్యసమస్య జాతీయసమస్య. హాప్సుబర్గురాజులు జాతీయవైషమ్యాల్నిబాగా వినియోగించుకుని విప్లవ

శక్తులు ఏకీభవించకుండా అడ్డుపెట్టగలిగేరు. అటు హంగేరియనులూ, ఇటు స్లావులూకూడా జాతీయసమస్యలకీ - సాంఘికసమస్యలకీ గల సంబంధాన్ని గుర్తించలేకపోయేరు. తామందరికీ ప్రధానశతృవయిన ఆస్ట్రియను జమీందారీ నిరంకుశత్వాన్ని ఎదుర్కొని ఓడించవలసిన ఆవశ్యకతని అర్థం చేసుకోలేకపోయేరు. ఆనాటి ఈపరిస్థితుల్ని మార్క్సు, ఏంజిల్సులు ఎంతోనిపుణతతో స్పష్టీకరించేరు. ప్రతివారూ వాటిని జాగ్రత్తగా చదివి అర్థం చేసుకోవలసినవే. ఆనాడు వారు వ్రాసిన విషయాలే– అంటే శ్రామికవర్గదృష్ట్యా జాతీయసమస్యల్ని పరిష్కరించడం ఏలాగ అనేదే నేటికీ ప్రధానసమస్య. శ్రామికవర్గ విప్లవంలో జాతీయ సమస్యల్ని పరిష్కరించిన విధానమే 1917 రష్యావిప్లవంలోగల గొప్పదనం. ఆ సమస్యనేగనక జాగ్రత్తగా పరిష్కరించి వుండకపోతే అక్టోబరు విప్లవం జయంపొంది వుండేదికాదు. ఏవిధమైన మినహాయింపులూ లేకుండా, స్వయంనిర్ణయాధికారం ఇచ్చివేసేరు. జారిస్టుసామ్రాజ్యంనుంచి విడిపోయి ఇస్తోనియా, ఫిన్లండు, లిథూనియా, లట్వియాలకి స్వతంత్ర రాష్ట్రాలుగానే వుండడానికి అవకాశాలు కలుగచేసేరు. ఆనాడు శ్రామికవర్గ విప్లవం జయంపొందడాని కివే కారణాలు. జయంపొందినాక కూడా సోవియటు యూనియను క్షేమంగా వుండడానికి ఇదే కారణం.

ఏభై ఏళ్ళక్రితం ఫ్రాన్సులోకంటె ఈనాడు జర్మనీలోని మధ్య తరగతులలో చైతన్యం చాలా తక్కువ. పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి పొందినకొలదీ వారిలో విప్లవ వ్యతిరేకభావాలు జాస్తీకాసాగేయి. 1848 జూలైలో ఫ్రాంక్‌ఫర్టు నగరంలో జర్మను చేతిపరిశ్రమాధికారులు సమావేశం అయ్యేరు. దానిలో పరిశ్రమలసంఘాలు (గిల్డులు) స్థాపించబడాలనీ; ప్రభుత్వమూ, మునిసిపాలిటీయూ నడిపిస్తూన్న వర్కుషాపులు మూసివెయ్య

బడాలనీ; ఫ్యాక్టరీలమీద ప్రత్యేకపుపన్నులు విధింపబడాలనీ; ఇంకా ఈలాగంటివే తీర్మానాలు చెయ్యబడినాయి. ఆ సమయంలోనే సమావేశం అయిన కార్మిక కాంగ్రెసులో పైవానికితోడు— జీవితాధారాలు లేనివారు వివాహం చేసుకోగూడదంటూ చట్టంకావాలని తీర్మానించేరు— "కొత్తగా సంసారం ఏర్పరచుకోదలచినవాడు, వారిని పోషించగలనని ఋజువు చేసుకోవాలి."

కొద్దో, గొప్పో రాజకీయచైతన్యంగల మధ్యతరగతులు, విద్యావంతులు— సంయుక్త జర్మన్ రిపబ్లికు కావాలనడంలేదు. చిన్న సంస్థానాలయందే వారికి మోజు.

## మార్క్సు : ఏంజిల్సులూ — విప్లవమూ.

మార్క్సు. ఏంజిల్సులు జర్మనీకి తిరిగి వచ్చింది మొదలుకొని, తమరు స్థాపించిన "న్యూ రేనిష్ జీటన్గ్"లో 'సంయుక్త జర్మన్ రిపబ్లిక్' అనే నినాదాన్ని ప్రచారం చెయ్యసాగేడు. వారి ఆశయం సఫలమే అయివుంటే తప్పకుండా విప్లవశక్తులలో తీవ్రత కలిగివుండేది. వారి దృష్టి ఒక్క జర్మనీ విప్లవం మీదనేకాదు. యూరపులోని విప్లవాలతో దానికి అవినాభావ సంబంధంవుందనే సంగతి వారు గుర్తించేరు. ఆనాటికి గల పరిస్థితుల్నిపట్టి 1848 విప్లవం బూర్జువావిప్లవమే. అదే సోషలిస్టు విప్లవంగా మారగలదని వారు ఆశించేరు. యూరపువిప్లవాల గొలుసుకత్తులో జర్మను విప్లవం ఒక గొళ్ళెం. దానిని విజృంభింపచేసి, దానిని ఆధారంగా చేసుకొని, యూరపులోని జమీందారీవిధానాన్నీ, యూరపులోని విప్లవప్రతికూలురకేంద్రం అనదగిన రష్యానీ కూలద్రోయాలని

వారి సంకల్పం. ఆవుద్దేశ్యంతోనే తమ పత్రికలో పోలండు స్వాతంత్ర్యం రక్షించేటందుకు రష్యాపై యుద్ధం ప్రకటించబడాలని వ్రాసేరు.

ఫ్రెంచి విప్లవ విజయానుభవం ఆధారంచేసుకొని, జాకోబిను అతివాదులు అధికారం తమచేతులలోకి తీసుకోవడంచేతనే విప్లవం విజయం పొందిందని మార్క్సు, ఏంజిల్సులు నిర్ధారణ చేసేరు. "యుద్ధంవలన మాతృభూమి ఆపదపాలవుతుంది. నిజమే. కాని, యుద్ధమే మాతృభూమిని కాపాడుతుందికూడాను." అందుచేతనే జర్మనీలో విప్లవం యొక్క విజయం, దేశంలోని విప్లవకర ప్రజాతంత్ర పక్షంలోని ప్రతివాదుల జయాపజయాలమీద ఆధారపడివుంటుందని వ్రాసేరు. యూరపులో రష్యను చక్రవర్తిమీద యుద్ధం బయలుదేరిందా రష్యను ప్రభుత్వం కూలిపోతుంది. రష్యాపతనంవలన ఇంగ్లండుకో కూడా మంచి పరిస్థితులు ఏర్పడవచ్చును. ఇంగ్లాండులేని విప్లవపోరాటం విప్లవపోరాటమేకాదు. అక్కడ ఛార్టిస్టులకి జయంకలిగిందా విప్లవం ప్రారంభం అయినట్లే. జర్మనుబూర్జువా విప్లవసంగం విశాలమై విజయం లభించిందా, ముందు ఇంగ్లండులోనూ, తరవాత ఫ్రాన్సులోను సోషలిస్టు విప్లవాలు రావడానికి మంచి అదును ఏర్పడుతుంది. 1848 నాటి ఈ తమ అభిప్రాయాలూ సోషలిస్టుశక్తినిగూర్చి తాము వేసిన అంచనాలూ, పొరపాటని తరవాత వారే గుర్తించేరు. ఆనాడు వారు సూచించిన ఎత్తుగడలవలన జర్మనీలో బూర్జువా విప్లవం సఫలం అయివుండేది. అంతే! కాని, మార్క్సు, ఏంజిల్సులు చూపించినమార్గాన ప్రపంచ విప్లవాన్ని సాగించగల వర్గం ఆనాటికి జర్మనీలోనేలేదు.

జర్మనీలో శ్రామికవర్గోద్యమం నెమ్మదిగా వృద్ధిచెందుతూంది. 'కార్మిక సోదరసమితు' లంటూ ఏర్పడుతూన్నాయి. వీటిని నడిపిస్తూన్నది,

కమ్యూనిస్టులీగు సభ్యులు. ముఖ్యంగా స్టీఫెన్ బోర్. కార్మిక సోదర సమితులు స్వతంత్రంగా ఏరాజకీయ పోరాటంలోనూ పాల్గొని వుండ లేదు. ఆర్థికవ్యవహారాలకొరకే అవి పనిచేసేవి. ఉత్పత్తిదారుల సహ కారసంఘాలకి అప్పులిచ్చి సహాయం చెయ్యడానికి 'క్రెడిట్ బ్యాంకు'లు పెట్టడం మొదలయిన పెట్టీబూర్జువా ఉటోపియను వాంఛలతోపాటు అవి 'పదిగంటల పని' కోసం కూడా ఆందోళన చేసేవి. "మావాంఛలు పెట్టుబడిదారుల వాంఛలకి వ్యతిరేకం కాదు. వారిలాగే మేమూ శాంతినే కోరుతాము."—వారి నిబంధనావళిలో ఇదొక వాక్యం!

బూర్జువా విప్లవాన్ని ముందుకు సాగించడానికి శ్రామికవర్గం ఏమి చెయ్యవలసివుంటుందో, వారి పాత్ర ఏమిటో, మార్క్స్ - ఏంజిల్సులు బాగా అర్థం చేసుకున్నారు. కనుకనే, శ్రామికుల దృష్టిని రాజకీయాల నుంచి మరల్చి, కేవలం ఆర్థిక సమస్యలకోసమే పోరాడిస్తూ, సంకుచిత దృక్పథం అవలంబించకూడదన్ని వారు స్పష్టంగా చెప్పేరు. 1905 విప్ల వానికి ముందు లెనిన్, మార్క్స్ సూచనలనీ - స్టీఫెన్‌బోర్ సూచలనీ జాగ్రత్తగా పరిశీలించి, విప్లవంలో శ్రామికుల దృష్టి ప్రధాన రాజకీయ సమస్యలవైపు మళ్ళించడంలో మార్క్స్ చాలా తెలివైనపని చేసేడనీ; 'బోర్' ఆలాగ చేయక శ్రామికవర్గాన్ని ధనికవర్గం వెనక్కాల చేతులు పిసుక్కుంటూ కూర్చోవలసిన స్థితికి తెచ్చేడనీ నిర్ణయించేడు. రష్యను బోల్షివిక్కులు 1905 విప్లవం శ్రామికవర్గ నాయకత్వం క్రింద నడవాలనే నిర్ణయించి, మార్క్స్ ఎత్తుగడలనే అనుసరించేరు. ఇంక మెన్షివికులు స్టీఫెన్‌బోర్ మాదిరిగానే శ్రామికుల కార్యరంగాన్ని సంకు చితపరచడానికే ప్రయత్నించేరు.

1848 లో జర్మనీకి వచ్చేక మార్క్సు - ఏంజిల్సులు విప్లవకార్య క్రమం గల శ్రామికవర్గ సంఘాన్ని ఏర్పరచడానికి ప్రయత్నించి విఫలులయ్యేరు. 'న్యూ - రెనిష్‌జీటన్గ్' ప్రకటనతో వారి కార్యానికి ఉపక్రమించేరు. ఆపత్రికద్వారా వారు 'ప్రజాతంత్రా'న్ని ప్రచారంలోకి తేసాగేరు. కొలోన్‌లోని డెమాక్రాటిక్ కమిటీలో సభ్యులుగా చేరేరు. ఫ్రెంచి మహావిప్లవంలో జాకొబిన్ పార్టీపుట్టి. విప్లవంలోనే బలపడింది. అదే మాదిరిగా జర్మనీలోకూడా విప్లవం అభివృద్ధి పొందినకొలదీ శ్రామికవర్గం స్వతంత్ర రాజకియ పక్షాన్ని నిర్మించుకోగలదని వారు నమ్మేరు. జారిస్టురష్యాతో యుద్ధానికి తలపడేటట్లుగా డెమాక్రాటిక్ శక్తుల్ని పురిగొల్పి. ఆమార్గంలో జర్మనీలో కూడా జాకొబిన్‌పార్టీ పుట్టేటందుకు తగిన సావకాశాలు కలిగించాలని వారు తీవ్రంగా ప్రయత్నించేరు. 1848 లో శ్రామికవర్గం యొక్క ప్రత్యేకరాజకీయపక్ష నిర్మాణానికి వారు ప్రాముఖ్యత ఇవ్వలేదంటేనే తెలుస్తూంది, జర్మనీ ఆనాటికి ఆర్థికంగానూ, రాజకీయంగానూ, ఎంత వెనకబడివుందో!

ఈమారు వచ్చే విప్లవంతో పెట్టీబూర్జువా డెమాక్రాట్లు అధికారంలోకి వస్తారని మార్క్సు చెప్పేడు. ఆవిజయం లభించిననాటినుంచీ కూడా, అంతవరకూ డెమాక్రాట్లకి సహాయం చేస్తూన్న శ్రామికవర్గం తమ పెట్టీబూర్జువామిత్రుల్ని ఒక కంట చూస్తూండడం అవసరం అన్నాడు. డెమాక్రాటిక్ సంఘాల్ని దిగతొక్కి, శ్రామికవర్గం ముందుకి వచ్చి నిలబడాలి. డెమాక్రాట్లు జమీందారీ విధానాన్ని రద్దుచేసి రైతాంగ పద్ధతి నెలకొల్పుతారు. కాని, పల్లెటూళ్ళలోని వ్యవసాయకూలీసంగతి వారు తలపెట్టరు. పల్లెటి బూర్జువాలు, పట్టణాలలోని పెట్టీబూర్జువాలతో చేయీ చేయీ కలిపేటప్పుడు శ్రామికవర్గం వ్యవసాయకూలీల లాభాల

కొరకై భూమిని జాతీయం చెయ్యాలని ఆందోళన చెయ్యాలి. ఏవిధంగా చూసినా శ్రామికవర్గం స్వతంత్రవర్గస్వభావం ప్రదర్శించవలసినదేగాని, ఒక్క క్షణం కూడా పెట్టీబూర్జువాల మోసపు మాటలకు ఏమరివుండ కూడదు. 'శాశ్వతవిప్లవం' అనేది వారినినాదం గావాలి. బూర్జువా డెమాక్రటిక్ విప్లవంలో శ్రామికుల కర్తవ్యాల్ని గూర్చి లెనిన్ వ్రాసిన విషయాలు, 1848 విప్లవం యొక్క అనుభవాన్ని ఆధారం చేసుకొని మార్క్సు వ్రాసిన దాని యొక్క వివరణమే.

"వీలు చిక్కినంత ముందుకి బూర్జువా విప్లవాన్ని నెట్టుకుపోవడం....మనకర్తవ్యం. ఈసమయంలో శ్రామికవర్గాన్ని స్వతంత్రంగా సంఘబద్ధం చెయ్యాలనే సంగతి మరువకూడదు."

—'లెనిన్'

## ప్రశ్నలు

1. జర్మనీ - ఆస్ట్రియాలలో బూర్జువా విప్లవాల ప్రధాన కర్తవ్యాలేవి ?
2. జర్మను బూర్జువాజీ విప్లవంలోంచి తప్పుకోడానికి కారణాలేమిటి ?
3. ఆస్ట్రియాలో విప్లవం ఓడిపోడానికి హేతువు లేమిటి ?
4. జర్మనీలో విప్లవం ఓడిపోవడానికి కారణాలేమిటి ?
5. 1848 ఆధారంగా మార్క్సు నిర్ణయాలేమిటి ?

# మొదటి 'ఇంటర్నేషనల్'

## ప్రధాన దేశాలలోని కార్మికోద్యమముయొక్క అభివృద్ధి.

1848 నాటి విప్లవం ఓడిపోయేక పశ్చిమయూరపులోని రాజకీయ వాతావరణంలో చాలాకాలం వరకూ స్తంభనం ఏర్పడింది. ఆకాలం అంతా విప్లవవ్యతిరేకుల ప్రభావం అప్రతిహతంగా వెలిగిపోయింది. అయినప్పటికీ ఆర్థికాభివృద్ధిమాత్రం ఆగిపోలేదు. 1850 మొదలుకొని పారిశ్రామికాభివృద్ధి తీవ్రతరం అయింది. బ్రిటను—ఫ్రాన్సులద్వారా పెట్టుబడిదారీవిధానం వెనుకబడియున్న దేశాలలోకంటా చొచ్చుకుపోయి, అచ్చట అదివరకున్న ఉత్పత్తివిధానాల్ని నాశనంచేసివేసింది. దాని మూలంగా పల్లెటూళ్ళలోని రైతులు; పట్టణాలలోని పెట్టీబూర్జువాలూ సర్వనాశనం అయిపోయేరు. వారిలోంచే ప్రత్యేకాస్తిఅంటూలేని శ్రామిక వర్గం ఏర్పడింది. ఈ ఏర్పడడంలోనే పెట్టుబడిదారీ పారిశ్రామిక విధానం విజృంభించడానికి మార్గం సుగమం అయింది. ఇతరదేశాలన్నింటిలోకన్న బ్రిటనులో పెట్టుబడిదారీ విధానం బాగా అభివృద్ధి చెందింది. 1850 నాటికే బ్రిటనులోని జనాభాలో సగానికిపైగా పట్టణాలకి చేరుకున్నారు. బ్రిటనులో 1800 నాటికి బొగ్గుయొక్క ఉత్పత్తి కోటి టన్నులు మాత్రమే. కాని 1855 నాటికి ఆరుకోట్ల పదిలక్షల టన్నుల వరకూ హెచ్చింది. 1840 లో ఇనుము 13,90,000 టన్నులు తవ్వబడింది. 1855 నాటికి అది 32,18,000 టన్నులకి పెరిగింది. అన్నిటి కన్నా బట్టల పరిశ్రమ మరీ విజృంభించింది. 1832 లో బ్రిటనులోని కదుళ్ళసంఖ్య 20 లక్షలు. కాని, 1858 నాటికి వాని సంఖ్య 280 లక్షలు. 1854—64 మధ్య రైల్వేల పొడుగు 8034 మైళ్ళనుంచి 12,789 వరకు పెరిగింది. 1850 నాటికి పెట్టుబడిదారీ ప్రపంచంలో బ్రిటనుది పైచెయ్యి.

ఫ్రాన్సులోకూడా మూడవ నెపోలియన్ కాలంలో పెట్టుబడిదారీ విధానం అవిచ్ఛిన్నంగా అభివృద్ధిపొందింది. 1852 లో ఫ్రాన్సులోని బొగ్గు ఉత్పత్తి 4,94,000 టన్నులయితే 1862 నాటికది 1,03,17,000 టన్నులయింది. అదేకాలంలో ఇనుము ఇత్పత్తి 5,22,000 టన్నుల నుంచి 10,91,000 టన్నులకి పెరిగింది. 1840 లో ఆవిరియంత్రాలున్న ఫ్యాక్టరీల సంఖ్య 3200. 1855 లో 6500; 1862 లో 15000 : 1840 నాటికి 1832 కిలోమీటర్ల పొడవుగల రైలుమార్గాలు వేయబడ్డాయి. 1860 నాటికి వానిపొడవు 9,439 కిలోమీటర్లు.

కాని, పెద్దపరిశ్రమలవిషయంలో బ్రిటనుకంటె, ఫ్రాన్సు బాగా వెనకబడివుంది. ఫ్రాన్సులో గృహపరిశ్రమలు, చేతిపరిశ్రమలు బాగా హెచ్చుగానేవున్నాయి. 1848 విప్లవం తర్వాత జర్మనీ పెట్టుబడిదారీ విధానాన్నే అనుసరించింది. బొగ్గు, ఇనుముల వుత్పత్తి హెచ్చింది. ఉక్కు, నేతపరిశ్రమలు పెంపుచెయ్యబడినాయి. రైల్వేలపొడవు, సముద్రపు రాకపోకలు ఎక్కువైనాయి. విదేశవ్యాపారం పెరిగింది. వీటన్నింటితోపాటు పరిశ్రమలలో కేంద్రీకరణంకూడా అమలుపరచబడింది. జర్మనీ చిన్నచిన్న రాజ్యాంగాలుగా విభజించబడివుండడంవల్ల పెట్టుబడిదారీవిధానం స్వేచ్ఛగా వృద్ధిపొందడానికి వీలులేకపోయిందిగాని, లేకుంటే ఇంకా పరిశ్రమలు బాగా వృద్ధిపొందివుండేవి.

పెట్టుబడిదారీ విధానముయొక్క ఈ అభివృద్ధి ఒక్క పశ్చిమ యూరపులోనేగాక ప్రపంచం అంతటా వ్యాపించింది. ఉత్తర అమెరికాలోనూ, రష్యాలోనూకూడా ఇది వేళ్లుపారింది. ఈకాలంలోనే పశ్చిమ యూరపు జాతీయవిప్లవాలతో పూర్తిగా మార్పుచెందింది. జర్మనీ, ఇటలీలు జాతీయంగా ఐక్యతని పొందేయి. 1848 లో వోడిపోయిం

తర్వాత కార్మికోద్యమం కొంతకాలంపాటు నిలబాటుచేసింది. కాని, త్వరలోనే అంటే 1855 నాటినుంచీ నెమ్మదినెమ్మదిగా కోలుకోసాగింది. కార్మికసంఘాలు ఒక్కొక్కటే తలెత్తేయి. నిజానికి ఆసంఘాలు బలహీనంగానూ, ఒకదానికొకటి సంబంధంలేకుండానూ వుండిపోయినాయి. వాటికి స్పష్టమైన రాజకీయాదర్శం వుండేదికాదు.

## ఇంగ్లండులో కార్మికోద్యమం.

1850 తర్వాత పదేళ్ళలోను ఇంగ్లీషు శ్రామికవర్గం రాజకీయంగా అణచివేయబడేవుంది. దీనికి కారణం ఛార్టిస్టు వుద్యమంయొక్క పరాజయమే. ఆ రోజులలో ఇంగ్లండు "ప్రపంచ కర్మాగారం" అనదగినంతగా పారిశ్రామికాభివృద్ధి పొందివుంది. పైగా అమెరికాకీ, ఆస్ట్రేలియాకీ వలసపోయిన ప్రజలసంఖ్య విపరీతం అయింది. కొద్ది సంవత్సరాలలో ఇంచుమించు యిరవైలక్షలమంది శ్రామికులు ఇంగ్లండు వదిలేరు. ఈ వలసపోవడంచేత శ్రామికవర్గంలో దిట్టమైన, సమర్థతగల వ్యక్తులసంఖ్య తగ్గింది. జీతాలు హెచ్చేయి. నిరుద్యోగం తగ్గింది. ఈ అన్నికారణాలచేతా ఇంగ్లండులో కార్మికోద్యమం అభివృద్ధిపొందే అవకాశాలు ఏర్పడలేదు. ఈకాలంనాటి బ్రిటిషు కార్మికసంఘాలు ఒకదానికొకటి సంబంధంలేకుండా విడివిడిగా ఏపరిశ్రమకి ఆపరిశ్రమకే వేరువేరుగా వుండేవి. రాజకీయ కార్యక్రమంఅంటేనే భయం. ఆర్థికపోరాటాలతో మాత్రమే సంతృప్తిపడివుండేవి. ఆరోజులతో ముందుకువచ్చి, కొంత అభివృద్ధి పొందిన కో-ఆపరేటివు సొసైటీలు, బెనిఫిట్ ఎసోసియేషన్లు మొదలయినవాని కంత సాంఘిక ప్రాముఖ్యతలేదు. 1859 నాటికి బెనిఫిట్ ఎసోసియేషన్లలోని సభ్యులసంఖ్య 30 లక్షలు. ఈ సంఘాలు కారణంగా

కార్మికవర్గానికి రాజకీయజీవితమూ, వర్గపోరాటవిధానమూ దూరమై పోయినాయి. ఆ యా వృత్తి సంఘాల కేంద్రీకరణ మార్గంలో ట్రేడ్ యూనియన్లు అభివృద్ధిపొందసాగినాయి. తాత్కాలికములైన ఆర్థిక సౌకర్యాలు గుంజుకోవడంమీదనే వానిదృష్టి కేంద్రీకరించబడింది. రాజకీయ దృష్ట్యా వారివిధానం ఎంతసేపూ బూర్జువా రాజకీయపక్షాల్ని సమర్థించడం తోనే సరిపోయింది. ఉదారవాదులకీ, అతివాదులకీ వీరు సహాయులుగా వుండేవారు.

1860 దాపున పరిస్థితులు కొంచెం మారడం ఆరంభించేయి. 1857 నాటి ఆర్థికదుస్థితివలన వర్గకలహం తీవ్రతరం అయింది. ఈ దుస్థితివలన కలిగిన బాధలన్నిటిని పెట్టుబడిదారులు కార్మికుల నెత్తిని రుద్దడానికి దండయాత్ర లారంభించేరు. ఆదాడుల్ని కార్మికులు సమ్మెలతో ఎదుర్కొన్నారు. 1859 లోనూ, 1861 లోనూ జరిగిన తాపీ పని వారి సమ్మెలు వీనిలో చెప్పదగినవి. ఈ సమ్మెలు ఇంగ్లీషు కార్మికలోకాన్నంతనీ వుద్రేకపరచి, ప్రత్యేక వృత్తిసంఘాల నేర్పరచుటలోగల సంకుచిత తత్వాన్ని బయటపెట్టింది. ఫలితంగా 1861 లో మొట్ట మొదటిమారుగా లండనులో "ట్రేడ్సు కౌన్సిలు" ఏర్పరచబడింది. 1868 లో మొదటి ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు జరపబడింది. క్రమేణా సమ్మిశ్రిత కార్మికసంఘాలు ఏర్పడడానికి ప్రోత్సాహం చిక్కింది.

## "ఫ్రాన్సులో కార్మికోద్యమం"

1848 జూన్ తిరుగుబాట్లకి ఫలితంగా తీసుకోబడిన ప్రతీకార చర్యలూ, నిర్బంధవిధానమూ కారణంగా ఫ్రాన్సులోని వుద్ధృతమైన

శ్రామికోద్యమం మంచి దెబ్బతింది. విప్లవభావాలఛాయకూడాలేని, శాంతి బోధకములయిన, 'ప్రౌధన్' యొక్క పెట్టీబూర్జువాసిద్ధాంతాలు ఆకాలపు వారి అభిప్రాయాల్ని బాగా ఆకర్షించేయి. ప్రౌధన్ పెట్టుబడిదారీ విధానానికి పూర్తిగా వ్యతిరేకి. కాని, ఆతని దృష్టిలో పెట్టుబడిదారీ సమాజంలోని దారిద్ర్యానికి మూలకారణం, ఉత్పత్తివిధానంలోగాక, వినిమయపద్ధతిలోనేవుంది. ఇదే పెట్టీబూర్జువా దృక్పథంలోని ప్రత్యేకత. ఈ ఆధారంమీద బయలుదేరి పరస్పర సహాయసంఘాలు; సహకార సంఘాలు; ఇంకా ఆమాదిరి సంఘాలయొక్క నిర్మాణంతో పెట్టుబడి విధానాన్ని ఎదిరించాలనే నిర్ణయానికి వచ్చేడు.

ప్రౌధన్ సోషలిస్టుకాడు. ఉత్పత్తి సాధనాలమీద సంఘం అధికారం తీసుకొనడం పచ్చిద్రోహంగా తలుస్తాడు. కమ్యూనిస్టు సమాజం ఆతని దృష్టిలో బానిససమాజం. స్వంతఆస్తి అనేది వుండితీరాలని వాదిస్తాడు. స్వతంత్రంగా వస్తూత్పత్తిలో పాల్గొనే, చిన్నఆస్తిపరుల సంఘం ఆతని లక్ష్యం. అల్లా అయితేనే పెట్టుబడిదారీ విధానం అనే జాడ్యం వదలిపోతుందని వూహ. కార్మికవర్గం రాజకీయపోరాటాలు జరపకూడదని ఆతని ఆశయం. సమ్మెలు పనికిరాదంటాడు. అవి అవినీతిపూరితములన్నాడు. సంఘంలో పాలకులు - పాలితులు అనేభేదం వుండకూడదన్నాడు. స్వతంత్ర ప్రజాసంఘాల స్వేచ్ఛాసమ్మేళనముగా మాత్రమే వుండాలన్నాడు. కనుకనే రాజ్యాంగం విషయంలో సంపూర్ణంగా తాటస్థ్యం వహించమని తన అనుచరులకి హితోపదేశం చేసేడు. పెట్టుబడిదారీ విధానంవలన దెబ్బతిన్న సాంఘికశక్తు లన్నింటినీ ఏకంచేసి, పోరాటం సాగించడానికి బదులు, ప్రౌధనిస్టులు ధనివర్గ సమాజానికి దూరంగా వుంటేనే చాలునని తలపోసేరు.

పెట్టుబడిదారీ విధానంచేత నాశనం చేయబడి, తిరిగీ తమ ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించుకోడానికి ప్రయత్నించుతూన్న చిన్నవుత్పత్తి దారుల సిద్ధాంతమే ప్రౌఢనిజం. ఫ్రాన్సులోని కార్మికవర్గం చైతన్యం పొందినది కాకపోవడంచేత, విప్లవవ్యతిరేకమైన ఈ పెట్టీబూర్జువా సిద్ధాంతం వారిలో బాగా వ్యాప్తిచెందింది. ఫ్రెంచి పరిశ్రమలలో కొన్ని ముఖ్యశాఖలలో (వినోదసామగ్రులు, కర్రసామానులు, తయారుచేసే కర్మాలయాలలో ప్రత్యేకంగా) జీతపుకూలీలకీ, చేతిపనివారికీ మధ్య భేదం స్పష్టంగా వుండదు.

కార్మికులలో కొన్నివర్గాలు నెపోలియను ప్రభుత్వపు ఏజంట్ల వలల్లో చిక్కుకున్నారు. కూలీలలోని వుద్రేకం చల్లార్చడానికీ, వారిని రాజకీయపోరాటాలకి దూరం చెయ్యడానికీ, కొద్దికొద్ది సౌకర్యాలు ఇయ్యబడినాయి. (వీనికే 'పోలీసు సోషలిజం' అని పేరు పెట్టేరు.) కూలీలలో కొద్దిమంది బ్లాంక్విని అనుసరించేరు. కొద్దిమంది విప్లవకారులతో ఒక రహస్యసంఘాన్ని కూర్చుకొని, సమయం చూసుకుని, ప్రభుత్వాధికారం లాక్కుని తమ నియంతృత్వం స్థాపించి సామాజిక విధానాన్ని మార్చవలసి యుంటుందని వారి అభిప్రాయం. నెపోలియన్ ప్రభుత్వం అంటే బ్లాంక్విస్టులకి అమితద్వేషం. అదినుంచీ ఆప్రభుత్వంతో వాటు పోరాటం సాగిస్తూనే వచ్చేరు. ఆర్థిక - సాంఘికసమస్యలకి వారు ప్రాముఖ్యత నియ్యలేదు. ప్రజాసామాన్యంలో ప్రచారం సంగతి వదిలేసేరు. కనకనే వారి సంఖ్య పెరగలేదు.

## జర్మనీలో కార్మికోద్యమం (లాసెల్లియానిజం)

1848 పోరాటాలలో పొందిన అపజయాలలో జర్మను కార్మికవర్గం గట్టిగా దెబ్బతింది. విప్లవం తర్వాత 1860 వరకూ కార్మికుల

సంఘాలు - ప్రత్యేకంగా కార్మిక విద్యాబోధక సంఘాలు - ఉదారధనిక వాదుల పథకాన్నే అనుసరించేయి. 1860—70 ల మధ్య జర్మనీలో పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందినాయి. జర్మనీ, పారిశ్రామికదేశాల లెక్కల్లో గణనకి వచ్చింది. ఈమార్పుతోపాటు కార్మికోద్యమంలో కూడా మార్పులు వచ్చేయి. వారికికూడా రాజకీయ హక్కులు - స్వాతంత్ర్యం లభించింది. 1861 లో శాక్సనీరాష్ట్రపు కార్మికుల ప్రోత్సాహాన 'జాతీయశ్రామిక సమావేశం' జరపడానికి నిర్ణయించబడి. "లీప్జిగు"లో కేంద్రసంఘం ఒకటి ఏర్పడింది. ఈ లీప్జిగుకమిటీ "లాసెల్లీ" వద్దకుపోయి కార్మికవర్గముయొక్క కార్యక్రమ ప్రణాళికను తయారుచేసి యిమ్మని కోరింది. ఆరోజుల్లో లాసెల్లీ (1825—1884) అతివాద రాజకీయవేత్తగా పరిగణించబడేవాడు. కమిటీ యొక్క కోరికపై అతడొక జాబువ్రాసేడు. దానిలో ప్రోగ్రసివ్‌పార్టీ (ఇది ఉదారధనికవాదుల పార్టీ) నుంచి విడిపోయి శ్రామికవర్గం ప్రత్యేక సంఘనిర్మాణం చేసుకోవాలని సూచించేడు. లీప్జిగ్‌కమిటీ ఆసూచనని అంగీకరించి ఆతని సూచనలనే జర్మను కార్మికవర్గోద్యమానికి ప్రణాళికగా ఏర్పరచింది. 1863 మే 23 వ తేదీన జర్మను కార్మికసమ్మేళనం ఏర్పరచబడింది. లాసెల్లీ దానికి మొదటి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఆతని మరణానంతరం "స్క్వైజరు" ప్రెసిడెంటయ్యాడు.

జర్మను కార్మికులలో చైతన్యం కలిగించి వారిని ప్రత్యేకంగా సంఘబద్ధం చేసినవాడు లాసెల్లీయే. సందేహం లేదు. కాని, మరొక్క విషయం. లాసెల్లీ పక్కా అవకాశవాది. జర్మనుశ్రామికవర్గంలో మంచి పలుకుబడి సంపాదించేడు.

లాసెల్లీ సిద్ధాంతాలుగాని, ఎత్తుగడలుకాని, మార్క్సిస్టు దృక్ప థంతో సరిపడవు. ఉదారధనికవాదులమీద దండయాత్ర సాగించడానికి జంకర్ల స్నేహం చేసేడు. బిస్మార్కుకి తోడ్పాటుచేసి కార్మికవర్గానికి సౌకర్యాలు సంపాదించబోయేడు. ఆతని ఈఅవకాశవాద విధానం వలన కలిగిన ఫలితం ఏమిటి? కార్మికోద్యమం ప్రష్యను నిరంకుశప్రభువుల పట్టుకొమ్మగా తయారయింది. ఏవిధమైన లొంగుబాటుదనానికీ అంగీక రించని మార్క్సు, లాసెల్లీయొక్క ఈతత్వాన్ని, శ్రామికవర్గానికి ద్రోహం చెయ్యడమేనని నిందించేడు.

లాసెల్లీ 'చారిత్రక భౌతికవాది' కాడు. ఆతని తాత్త్వికాలోచనలు కేవలం ఆదర్శవాదధోరణిలో సాగుతాయి. బూర్జువా రాజ్యాంగంయొక్క వర్గస్వభావం విషయమై ఆతనికి స్పష్టమైన అభిప్రాయాలులేవు. "రాజ్యాంగం యొక్క నిజమైన కార్యక్రమం మానవజాతికి స్వతం త్రంగా జీవించడం నేర్పి తయారు చెయ్యడమే" నని ఆతనివాదం. ఈ బూర్జువా ఆదర్శవాద సిద్ధాంతాన్ని నమ్మి లాసెల్లీ సార్వజనికవోటు హక్కుకి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చేడు. "ఆవోటుహక్కుద్వారా శ్రామికులు సంపాదించగల ప్రాతినిధ్యం వారి హక్కుల్ని కాపాడగల దనీ; వర్గభేదాల్ని నాశనం చెయ్యగలదనీ ఆతని నిశ్చయం. (జర్మను వర్కర్సు యూనియన్ నిబంధనావళినుంచి - 1863) నేటికీ జర్మన్ సోషల్ డెమాక్రాట్లు ఈఅభిప్రాయాల్నే అనుసరిస్తున్నారు. వారికి లాసెల్లీ యొక్క "స్వచ్ఛమైన ప్రజాతంత్ర విధానము" నందు నమ్మకం చెడ లేదు. కార్మికవర్గ శత్రువులలో గల వేరువేరు వర్గస్వభావాలని ఆతడు గుర్తించలేడు. ఆతని వుద్దేశ్యంలో రైతులు కేవలమూ కార్మికవర్గానికి శత్రువులు. ఆతనికి అంతర్జాతీయతయందుకూడా నమ్మకం లేదు.

"లాసెల్లీ కార్మికోద్యమాన్ని అతిసంకుచితమైన జాతీయవాద దృక్పథంతోనే చూస్తాడు. ఇది కమ్యూనిస్టు మానిఫెస్టోకీ, అంతకు పూర్వమేవున్న ఇతర సోషలిస్టు విధానాలకీ కూడా పూర్తిగా వ్యతిరేకం."

మార్క్సు - ఏంజిల్సులు "ప్రోగ్రాముల విమర్శ"

ప్రధానములైన విషయాలలో అంటే - ప్రష్యనునాయకత్వాన జర్మనీ జాతీయైక్యత స్థాపించడము; జర్మనీలో పోలండును కలిపివేసు కొనడము; బలాత్క్రమణ విషయంలో బిస్మార్కు కార్యక్రమాలకి తల వొగ్గడం;—ఈలాంటి విషయాల్లో లాసెల్లీ కేవలం సంకుచిత జాతీయ వాద దృక్పథాన్నే అనుసరించేడు. ఈతన్ని అనుసరించే 1914 లో హఠాత్తుగా దేశాభిమానపుగుబులు ఆవహించిన కాన్రాడ్ హైనిక్ (సోషల్ డెమాక్రాటు) ఈవిధంగా గర్జించేడు.

"లాసెల్లీ మృతజీవియే. ఆతడు తనపార్టీ ఒక్కదాంట్లోనేకాదు-యావత్తు జర్మను ప్రజాహృదయాలలోనూ జాగరితం అవుతున్నాడు."

లాసెల్లీ కేవలం సంస్కరణవాది. ఆతని బోధనలన్నీ విప్లవ వ్యతిరేకాలే. అయినా ఆతడు జర్మను కార్మికోద్యమాభివృద్ధికై శ్రమ పడ్డాడు. తాను చెప్పేవి ఫలానాదానిలోనివి అని చెప్పకపోయినా, మార్క్సు అభిప్రాయాలు చాలవరకు జర్మను శ్రామికులలో ప్రచారం చేసేడు.

జర్మనువర్కర్సు యూనియను, జర్మను చట్టాలప్రకారం మొదటి ఇంటర్నేషనలుతో ఎక్కువసంబంధం పెట్టుకొనడానికి వీలులేక దూరంగా వుండిపోయినా, తరచుగా ఇంటర్నేషనలుయొక్క నిర్ణయాలనీ, కార్య క్రమాన్నీ అంగీకరించినట్లుగా ప్రకటిస్తూ వచ్చింది.

1869 లో "ఐసెనాక్" అనేచోట శ్రామిక విద్యాప్రబోధ సంఘాల సమావేశం జరిగింది. ఆసమయంలో, అక్కడనే సోషల్ డెమాక్రాటిక్ లేబర్ పార్టీ అనేపేర మరోసంఘం ఏర్పరచబడింది. మొట్టమొదట్లో ఈ సంఘం శాక్జనీరాష్ట్రింలోని పీపుల్సు పార్టీతో కలిసివుండేది. ఈ పీపుల్సు పార్టీ పెట్టీ బూర్జువా, రాడికల్, డెమాక్రాటిక్‌పార్టీ. ఈ సోషల్ డెమాక్రాటిక్ లేబర్‌పార్టీకి నాయకులు విల్హెల్మ్ లీబ్నెట్. (1826-1900) ఆగస్టు బెబెల్ (1840-1913) లు. ఈ "ఐసెనాక్" పార్టీ లాసెల్లీ యొక్క పొరపాటు అభిప్రాయాలనే అనుసరిస్తూ వచ్చినా, చాలవరకు మార్క్సిస్టు సిద్ధాంతాలని అనుసరిస్తూ, ఇంటర్నేషనలుతో సంబంధం పెట్టుకొనేది.

## ఇంటర్నేషనలుయొక్క స్థాపన.

1860 గడిచేక ఇంగ్లాండు, ఫ్రాన్సులలో కార్మికోద్యమాలు తిరిగీ తెలలెత్తసాగినాయి. అమెరికాలో జరుగుతూన్న అంతర్యుద్ధంవల్ల యూరపులో పత్తికి కరవువచ్చింది. (1861-65) దానివలన బట్టలపరిశ్రమ స్తంభించింది. వేలకొలది కూలీలు నిరుద్యోగులయ్యేరు. ఈ సమయం లోనే యజమానులుకూడా కూలీలపరిస్థితులు మరింత దుర్భరం చేయ డానికి సమకట్టేరు. వెంటనే ప్రతిఘటన ఏర్పడింది. లండను ట్రేడ్స్ కౌన్సిలు నిరుద్యోగుల సహాయానికి ఒకసంఘాన్ని ఏర్పాటుచేసింది. అటువంటిదే మరొకటి ఫ్రాన్సులోనూ ఏర్పడింది. ఆ రెండుసంఘాలూ ఒకదానితో వొకటి సంబంధాలు ఏర్పరచుకొన్నాయి. ఆవిధంగా వివిధ దేశాలకూలీలు ఏకంకావలసిన ఆవశ్యకతనీ, స్వరూపాన్నీ మొదటి పర్యాయంగా ఫ్రాన్సు, బ్రిటనులలోని కూలీలు స్పష్టంగా చూడగలిగేరు.

1863 లో రష్యామీద పోలిషు ప్రజలు చేసిన తిరుగుబాటు యూర

పియను శ్రామికవర్గోద్యమానికి కొంతప్రోత్సాహం కలిగించింది. వారు ఈ తిరుగుబాటుకి సంపూర్ణమైన సానుభూతీ - ఉత్సాహమూ ప్రకటించేరు. తిరుగుబాటుని ప్రోత్సహిస్తూ ఇంగ్లాండు - ఫ్రాన్సులలో ఆందోళన సాగించబడింది. సభలు చేయబడినాయి. ఊరేగింపులు నడపించబడి నాయి. పోలండుకి సహాయం చెయ్యమంటూ ఆయాప్రభుత్వాలకి విజ్ఞాప నలు చేయబడినాయి. 1863 లో పోలిష్ తిరుగుబాటుదారులయెడ సాను భూతిచూపడానికై లండనులో వివిధజాతుల సమావేశం సమకూర్చబడింది. ఆసమావేశానికి ఇంగ్లీషు, ఫ్రెంచి, కార్మికప్రతినిధులు హాజరయ్యేరు. ఆంగ్లకార్మికులకీ యూరపియనుకార్మికులకీ మధ్య నిరంతరసంబంధాలు ఏర్పరచుకోవలసిన ఆవశ్యకత వున్నదంటూ ఈసభలో చర్చించబడింది. ఆరోజులలో బ్రిటీషు యజమానులు బ్రిటిషుకూలీలమీద పోటీగా చౌక రేట్లకి బెల్జియం - ఫ్రాన్సు - జర్మనీలనుంచి కూలీలని దిగుమతి చేసు కుంటూ వుండేవారు. బ్రిటిషు కార్మికసంఘాల కిది ఒక గడ్డుసమస్య అయిపోయింది. ఈపద్ధతిని నిరోధించాలంటే, ఆయాదేశాల కార్మిక సంఘాలతో సంబంధాలు ఏర్పరచుకోవాలి. దానికై ప్రథమంలో ఫ్రెంచి కార్మికులకి విజ్ఞప్తి పంప నిర్ణయించుకున్నారు. పైసమావేశం జరిగిన కొద్దికాలానికే విజ్ఞప్తి పంపబడిందికూడా.

"ప్రజలతో స్నేహం కలిగివుండడం శ్రామికవర్గానికి అత్యవసరం. పనిగంటలు తగ్గించమనీ - జీతాలు హెచ్చించమనీ, మనకి సౌకర్యాలు సంపాదించుకుందుకు ప్రయత్నించినప్పుడెల్లా పెట్టుబడిదారులు బెల్జియం నుంచీ, జర్మనీ ఫ్రాన్సులనుంచీ, తక్కువ జీతాలమీద కూలీలను తీసుకొని వస్తామని బెదిరిస్తున్నారు....దురదృష్టవశాత్తూ ఈబెదరింపు తరచుగా కార్యరూపం ధరిస్తూంది కూడాను."

ఈవిజ్ఞప్తిచేరేటప్పటికి ఫ్రాన్సులో కూలీసంఘాలదృష్టి అంతా

త్వరలోనే జరుగబోతూన్న ఛాంబర్ ఆఫ్ డిప్యూటీస్ ఎన్నికల ౦ద కేంద్రీకరించివుంది. అందుచేత వారు ఏడాదివరకూ దీనికి సమాధా ం పంపలేదు. ఆపర్యాయమే మొట్ట మొదటిమారుగా వారి ప్రతినిధులు స్వత ం త్రంగా ఎన్నికలలో పోటీకి నిలబడ్డారు. ఎన్నికలకి ముందు ప్రత్యేకంగ తమరు పోటీచేయవలసిన ఆవశ్యకతని నిరూపిస్తూ వారొక ప్రణాలికను కూడా ప్రకటించేరు. దానినే "అరువది మంది ప్రణాళిక" అంటారు. ప్రణాళిక చివర 60 మంది సంతకాలు వుండడంచేత దానికాపేరు. అందులో ప్రౌధన్ విధానంలో బూర్జువాసమాజాన్ని విపర్శించేరు. కాని, రాజకీయపుఎత్తుగడల విషయంలో వారు ప్రౌధన్ సిద్ధాంతాలకి వ్యతిరే కించేరు. కార్మికులకి ప్రత్యేకంగా రాజకీయపార్టీ వుండాలనీ, ఎలక్షన్లలో వారి ప్రతినిధులు ప్రత్యేకంగా నిర్ణయించబడాలనీ ప్రకటించేరు. ఆంగ్లే యుల విజ్ఞప్తికి, ప్రౌధన్ సిద్ధాంతాల ననుసరించి పెట్టుబడిదారీవిధానపు పోటీలనూ, గుత్తవ్యాపార విధానాన్నీ, ఫ్రెంచికార్మికులుక్లుప్తంగా విమర్శిం చేరు, ఆంగ్లేయులు తమ విజ్ఞప్తిలో ట్రేడ్‌యూనియను పోరాటాలమీద ఒత్తి ఒత్తి వ్రాసేరు. ఫ్రెంచి కార్మికుల సమాధానంలో పారిశ్రామికాభి వృద్ధి, శ్రమవిభజన, స్వేచ్ఛావాణిజ్యవిధానం, వీనికి ప్రాధాన్యత ఇయ్య బడింది.

"పారిశ్రామికాభివృద్ధి, శ్రమవిభజన, పనిచేయడంలో స్వేచ్ఛ,-ఈ నూతన విషయాల్నిగురించి మనం శ్రద్ధతీసుకోవాలి. ఇవే మన సమాజం యొక్క ఆర్థికవిధానాన్ని పూర్తిగా మార్చి వెయ్యగలవి. ఈ నాటి పరిస్థితు లకి అనుగుణంగా, వాటి ప్రాబల్యంచేత; పెట్టుబడిఅంతా బలీయము లయిన బ్యాంకులకీ - పారిశ్రామిక సంస్థలకీ చేరిపోతూంది. మనం తప్ప దీనిని ఎదిరించ గల మరోశక్తిలేదు. మనం గనక ఎదిరించకపోయామా,

భవిష్యత్తులో మన దురవస్థకి మేరవుండదు........ఈభయంకరవిధానాన్ని అడ్డుకొనడానికి ప్రపంచకార్మికులందరమూ ఏకీభవించి ఒక పెద్ద అడ్డు గోడ తయారుచేయాలి. లేదా మానవజాతి రెండువర్గాలుగా చీల్చివేయ బడుతుంది. కోట్లకొలది అమాయకప్రజ లొకవైపూ, కొద్దిమంది కడుపు నిండిన మోసగాళ్ళొకవైపూ, విభజింపబడతారు."

1884 సెప్టెంబరునెలలో ఫ్రెంచి ప్రతినిధులు తమ సమాధానం తీసుకొని ఇంగ్లండు వచ్చేరు. ఆ నెలలోనే 28 వ తేదీన జరిగిన సభలో మొదటి ఇంటర్నేషనలుకి పునాదులు వెయ్యబడినాయి. ఆ సభలో బ్రిటిషు కార్మికుల విజ్ఞప్తీ, ఫ్రెంచి కార్మికుల సమాధానమూ కూడా చదవబడి అంగీకరించబడినాయి. అంతర్జాతీయకార్మికసంఘం ఒకదాన్ని స్థాపించ డానికి సభలో నిర్ణయించబడింది. ఈ నూతన సంస్థకి కార్యక్రమమూ, నిబంధనావళీ తయారు చెయ్యడానికి ఒక కమిటీ ఎన్నుకోబడింది.

ఈ కమిటీలో ఆంగ్ల - పరాసుకార్మికప్రతినిధులు, లండనులో కా పురం వుంటూన్న జర్మను - ఇటాలియను ప్రవాసితులూకూడా వున్నారు. ఈ ఎన్నుకోబడినవారిలో మార్క్సు ఒకడు. వివిధభావాలసమ్మేళనంతో ఈకమిటీ ఒకకలగూరగంపలా తయారయింది. కార్మికవర్గోద్యమంలోని అన్నిరకాల సంస్థలు; అన్నివిధాల సిద్ధాంతాలకి సంబంధించిన వారు దానిలో వున్నారు. ట్రేడ్‌యూనియనిస్టులు; ఓవెనైట్లు; ఛార్టిస్టులు; ప్రౌధ నిస్టులు; బ్లాంకిస్టులు; జర్మనుకమ్యూనిస్టులు; పోలిషు - ఇటాలియను జాతీయవిప్లవకారులు దానిలో వున్నారు. వారివారి అభిప్రాయాలువేరు. ఒక్కొక్కవిషయంలో ఒకదానికొకటి విరుద్ధంగావుంటాయి. ప్రధాన మైన కార్మికవర్గోద్యమ సమస్యలు వచ్చేటప్పటికివన్నీ ముందుకువస్తాయి.

నిబంధనలు, కార్యక్రమం తయారుచేసే పనిని ఈకమిటీ మార్క్సుచేతిలో పెట్టింది. ఇది మహాకఠినకార్యం, తనవిప్లవభావాల్ని ఏమాత్రమూ నాశనం చేసుకోకుండా, ఆకమిటీలోవున్న వివిధ పక్షాల సభ్యులు అంగీకరించ గలిగేటట్లుగా నిబంధనలు, కార్యక్రమం తయారు చెయ్యాలి. మార్క్స తనపని చాలా చాతుర్యంతో నెరవేర్చేడు. ప్రారంభోపన్యాసంకూడా ఆరడే తయారుచేసేడు. దానిని కమిటీ అంగీకరించింది. ఆతడు నిర్మిం చిన నిబంధనావళి, కార్యక్రమమూ అంతర్జాతీయ కార్మికవర్గ పోరాటానికి మూలసిద్ధాంతాలయినాయి. ప్రపంచకమ్యూనిస్టు చరిత్రలో ఒక ప్రధాన పత్రంగా వున్నాయి.

## ఇంటర్నేషనలుయొక్క కార్యక్రమమూ - నిబంధనలూ

దీని ప్రారంభోపన్యాసమే ఒక ప్రణాళిక. ఇంటర్నేషనలుయొక్క కార్యక్రమానికి ప్రాతిపదిక! దానిలో ఆనాటి కార్మికవర్గముయొక్క యథాస్థితి నిరూపించబడింది. పరిశ్రమలలోనూ, వాణిజ్యంలోనూ అభి వృద్ధి కలిగిననూ, కార్మికుల దుస్థితిలో మార్పులేదని నిరూపించేడు. పెట్టుబడిదారీ విధానం అమలులో వున్నంతవరకూ వారిబాధలలో మార్పు వుండదని స్పష్టంచేయబడింది. ఇంగ్లండులో ప్రవేశపెట్టబడిన 10 గం టల పనిబిల్లూ, అచ్చట ప్రబలం అయిన కో-ఆపరేటివు ఉద్యమమూ; గతరెండేళ్ళలోనూ కార్మికవర్గం పొందిన రెండువిజయాలకీ చిహ్నాలని దానిలో గుర్తించబడింది.

"పదిగంటలపని చట్టం ఒక మహత్తరమైన కార్యసాధనమాత్రమే కాదు. సిద్ధాంతవిజయంకూడా. చరిత్రలో ప్రప్రథమపర్యాయం బూర్జువా అర్థశాస్త్రం - కార్మిక అర్థశాస్త్రం ముందు తలవంచింది."

"కో-ఆపరేటివులుకూడా ఇట్టి విజయచిహ్నాలే. కబుర్లలో బదులు కార్యక్రమంలో, బూర్జువావర్గంతో నిమిత్తంలేకుండానే పెద్ద పెద్ద పరిశ్రమలని నిర్వహించడానికి తగు సావకాశాలున్నాయని నిరూపింపబడింది. కాని, ఒక్క విషయం. కో-ఆపరేటివులవలన పెట్టుబడిదారీవిధానంయొక్క ఉద్ధృతం నిలబడదు. కార్మికవర్గానికి స్వాతంత్ర్యమూ కలుగదు. అందుచేత వానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇయ్యడానికి వీలులేదు."

"కార్మికులు స్వాతంత్ర్యం పొందాలంటే ముందుగా రాజ్యాంగ యంత్రం స్వాధీనం చేసుకోవాలి. ఒక ప్రత్యేకసమయం వచ్చేటప్పటికి ఇది ప్రధానసమస్య ఔతుంది. తమరు అనుభవిస్తూన్న ఆర్థికసౌకర్యాల్ని, అధికారాన్నీ దృఢపరచుకొనేటందుకై భూస్వాములు పెట్టుబడిదారులూ అంతవరకు తమచేతులలోనేవున్న రాజకీయాధికారాన్ని సంరక్షించుకుందుకే తాపత్రయపడతారు. వారిని ఓడించి, అధికారంలోకి రావడానికి శ్రామికులవద్దనున్నదొక్క సంఖ్యాబలమే। కార్మికులు ఒక సంస్థగా ఏర్పడి, చైతన్యంతో పనిచేసినప్పుడే వారు సంపూర్ణముగా కృతకృత్యులు కాగలరు."

కార్మికపోరాటం నెగ్గాలంటే అంతర్జాతీయ కార్మికశక్తులన్నీ సమ్మేళనం గావాలి, ఇంటర్నేషనల్ వర్కింగ్‌మన్స్ అసోసియేషన్‌యొక్క కర్తవ్యం ఇదే. కార్మికుల్ని అణచిపెట్టడం కొరకే ఏర్పడిన బూర్జువా రాజ్యాంగాలకూటనీతి దోపిడీయుద్ధాలు సాగిస్తుంది. కార్మికులలో చీలికలు కలిగిస్తుంది. దౌర్జన్యపూరితము, పరాధీనతకి మూలకందము అయిన ఈ బూర్జువాకూటనీతిని శ్రామికవర్గం అన్నివిధాలా ఎదిరించి తీరాలి.

అందుచేతనే ఇంటర్నేషనలుయొక్క నిబంధనావళిలో ఈవిధంగా నిర్దేశించబడింది.

"కార్మికవర్గం తన స్వాతంత్రాన్ని తానే సంపాదించుకోవాలి"....

దానికోసం—

"జీవనాధారాలయిన ఉత్పత్తిసాధనాలమీద అధికారం స్థాపించుకున్నవారికి ఆర్థికంగా శ్రమజీవి లొంగివుండడం అనేదే నేటి సాంఘిక దురవస్థకి, బుద్ధిశూన్యతకి, రాజకీయబానిసత్వానికి ప్రధానకారణం.

అందుచేత ఆర్థిక స్వాతంత్ర్యసంపాదనమే కార్మికవర్గంయొక్క గమ్యం ప్రతీరాజకీయోద్యమమూకూడా ఆస్వాతంత్ర్య సంపాదనలో ఒక సాధనమాత్రంగా వినియోగించబడాలి.

ప్రతిదేశంలోనూ కార్మికులలోనే ఎన్నోభేధాలు ఏర్పడి వారిలో ఐకమత్యంలేకపోవడమూ, వేరువేరు దేశాలలోని శ్రామికులమధ్య సోదర సంబంధాలు ఏర్పడకపోవడమూ వలన ఇంతవరకూ చెయ్యబడిన ప్రయత్నాలన్నీ వ్యర్థం అయిపోయినాయి.

కార్మికస్వాతంత్రం అన్నది ఏఒక్కప్రదేశానికో, ఏఒక్కజాతికో సంబంధించినవిషయంకాదు. ఇది ఒక సాంఘికసమస్య. ఆధునిక సాంఘిక విధానం అమలులోవున్న ప్రతిదేశానికీ ఇది అవసరమే. అభివృద్ధి పొందిన నాగరికదేశాలు సిద్ధాంతవిషయాలలోను-కార్యక్రమంలోనూ ఏకీభవించి పనిచేసినప్పుడే.ఆస్వాతంత్ర్యసంపాదన సాధ్యం అవుతుంది.

ఈసాధనకే ఇంటర్నేషనలు సృష్టించబడింది,

దానినిర్మాణం ఈక్రింది విధంగా నిర్ణయించబడింది :

ప్రతిదేశంలోనూ ఇంటర్నేషనలుయొక్క శాఖ ఒకటి స్థాపించబడుతుంది. అది నేషనల్ ఫెడరేటివ్‌కౌన్సిలుద్వారా వ్యవహరిస్తుంది. నిర్ణీత కాలవ్యవధిలో జరుపబడే ఇంటర్నేషనలు కాంగ్రెసులో కార్మికోద్యమముయొక్క ప్రధానసమస్య చర్చించి నిర్ణయించబడుతూండాలి. అందు

లోనే జనరల్‌కౌన్సిలుపేరిట ఒక ప్రధానకార్యనిర్వాహక సంఘాన్ని ఎన్ను కోవాలి. ఈ జనరల్ కౌన్సిలుకు పెద్ద అధికారాలు ఇయ్యబడినా, అది అంతర్జాతీయ కార్మికోద్యమానికి సిద్ధాంత నిర్ణయాలలో మాత్రమే నాయ కత్వం వహించి నడపవలసియుంటుంది. నిర్మాణసమస్యలతో దానికెక్కువ సంబంధంలేదు. మొదటి ఇంటర్నేషనలుయొక్క ఈమూల సిద్ధాంతాన్నే రెండవ ఇంటర్నేషనలు పూర్తిగా మరచిపోయింది. రెండవ ఇంటర్నేష నలుచేత స్థాపించబడిన "ఇంటర్నేషనల్ సోషలిస్టుబ్యూరో" చాలా తక్కువ అధికారాలు కలిగి, కేవలం వార్తలు సంగ్రహించడానికి, పరి స్థితుల్ని ప్రచారంలోకి తేవడానికిమాత్రమే వుపయోగించింది. మరల మూడో ఇంటర్నేషనలు మొదటిదానినే అనుసరించింది. దానియొక్క నిర్మాణవిధానాలలో అభివృద్ధి తీసుకువచ్చింది. ఆపునాదులమీదనే అది సమ్మిళితము, కేంద్రీకృతమునైన ఒక ప్రపంచకమ్యూనిస్టుపార్టీని సృష్టించింది.

## మొదటి ఇంటర్నేషనలుయొక్క చరిత్రలో మొదటి దశ, ప్రౌఢనిజంతో పోరాటం.

మొదటి ఇంటర్నేషనలుయొక్క మొదటి కాంగ్రెసు 1866 సెప్టెం బరు నెలలో జినోవాలో జరిగింది. సమావేశానికి వచ్చినవారిలో ఎక్కువ మంది ఫ్రాన్సు, స్విట్జర్లండులనుండి వచ్చిన ప్రౌఢనిస్టులే. మార్కుసుచేత తయారు చెయ్యబడిన ఆంగ్లేయకార్మిక ప్రతినిధులు వారికి ఎదురొడ్డేరు.

నిబంధనావళి చర్చింపబడినప్పుడు ప్రౌఢనిస్టులు ఒకవాదం లేవ తీసేరు. కేవలం శారీరకపరిశ్రమచేసే శ్రామికులు మాత్రమే ఇంటర్నేషన లులో చేర్చుకోబడాలంటూ తీర్మానం తీసుకొచ్చేరు. అంతర్జాతీయ సహ

కారము, పెట్టుబడి - కూలిపని మధ్యగల పోరాటమునకు సంబంధించిన ప్రశ్నలుకూడా ఆ సమయంలోనే చర్చకివచ్చేయి. ప్రౌధనిస్టులు సమ్మెలు పనికిరావనీ, సహకారసంఘాలు ఏర్పరచబడాలనీ వాదించేరు. స్త్రీకూలీల విషయంలో వారు కేవలము విప్లవనిరోధకమైన దృక్పథం స్వీకరించేరు. ప్రజాహిత జీవితంలోనికీ, ఉత్పత్తివిధానంలోనికీ స్త్రీలు ప్రవేశించకూడ దన్నారు. స్త్రీలకి వంటపొయ్యే జీవిత పరమావధియన్నారు. ఈవిధంగా ప్రౌధనిస్టులు అర్థంలేని పూర్వకాలపుటూహల్ని అంతర్జాతీయ కార్మిక కార్యక్రమంలో ప్రవేశపెట్టబోయారు: కాని, అవి చాలవరకు కాంగ్రెసు చేత నిరాకరించబడినాయి.

కార్మికసంఘాలనిగూర్చి, మార్క్సు వ్రాసిన థీసిస్ ఏకగ్రీవంగా కాంగ్రెసుచేత అంగీకరించబడింది. కార్మికవర్గ నిర్మాణానికి వృత్తి సంఘాలు ప్రాణాధారాలనీ, అవి తమ దైనందిన ఆర్థికపోరాటాలు సాగించడంకోసమేగాక, సంపూర్ణంగా కూలిపని పద్ధతిని నాశనంచేసేటందుకు సాధనములుగా వుపయోగిస్తాయనీ, నిరూపించబడింది. ఈ నిర్ణయమే నేటికీ కార్మికసంఘాల కర్తవ్యాన్నీ, ప్రాధాన్యతనీ తెలిపే ప్రధాన సూత్రంగా గుర్తించబడుతూంది.

ఈ సమావేశంలో రష్యాయొక్క సామ్రాజ్యవాదకాంక్షలు తిరస్కరించబడినాయి. సోషల్ డెమాక్రాటిక్ విధానంలో పోలండు పునర్నిర్మాణం సాగించబడాలని తీర్మానించబడింది. 8 గంటలుపని, స్త్రీలకీ, బాలురకీ ప్రత్యేకరక్షణలు మొదలగు కూలీ రక్షణ చట్టాలు అమలు జరిపించుటకై కార్మికులు ప్రయత్నించాలని నిర్ణయించబడింది.

జినోవాకాంగ్రెసు అన్ని దేశాలలోనూ సంచలనం కలిగించింది. 1866 లో షెఫీల్డులో ఇంగ్లీషు కార్మికసంఘ ప్రతినిధులు సమావేశం

అయినప్పుడు చేసిన తీర్మానం చూస్తే కార్మికసంఘాలు ఇంటర్నేషనలు యెడల ఎట్టి దృక్పథం ప్రదర్శించేయో స్పష్టపడుతుంది. "దేశవిదేశాల లోని కార్మికవర్గాన్నంతనీ సోదరబాంధ్యముతో ఏకం చేయడానికి ఇంట ర్నేషనలుచేస్తూన్న కృషిని ఈసమావేశం సంపూర్ణంగా ఆమోదిస్తూంది" అని తీర్మానిస్తూ, కార్మికసంఘాలన్నింటినీ ఇంటర్నేషనలుకి అను బంధింపచెయ్యాలని హెచ్చరించేరు.

ఇంగ్లండులోని కార్మికనాయకులలో చాలమంది ఇంటర్నేషనలులో చేరేరు. ఫ్రాన్సులో దీనికి కొన్నిశాఖలు ఏర్పడినాయి. స్విట్జర్లాండు, ఇటలీ, జర్మనీ, బెల్జియములలో దీనిపలుకుబడి హెచ్చింది. ఒక వింత సంగతి. మొదటి రోజులలో బూర్జువా పత్రికలు ఇంటర్నేషనలును తెగ పొగిడేయి. కాని అది సమ్మెలవిషయంలో చూపుతూన్న దృక్పథమూ, దానియొక్క సమావేశాలలో చేయబడుతూన్న తీర్మానాలూ చూసి, వారు కళ్ళుతెరచేరు. ఒక్కమారుగా అది "కొంపలంటించేవారి ముఠా" "దేవుడూ - దయ్యమూలేనివారిగుంపు"—"అరాజకుల - నాగరితావినాశ కుల సంఘము" అంటూ దీవించ నారంభించేయి.

1867 సెప్టెంబరునెలలో లాసేన్‌లో రెండో కాంగ్రెసు జరిగింది. "పరపతి - పీపిల్సుబ్యాంకులు" కి సంబంధించిన ప్రౌఢనిస్టుల తీర్మానం ఒకటి ఇందులో చెయ్యబడింది. ట్రేడ్‌యూనియనులు "జాతీయ పరపతి పద్ధతి" ఏర్పాటు చెయ్యాలని సూచించబడింది.

"రాజ్యాంగం" యొక్క కర్తవ్యాలను చర్చిస్తూ, "భూమి ప్రజ లందరియొక్క ఆస్తి" అనే తీర్మానం ప్రవేశపెట్టబడింది. ఫ్రెంచి ప్రతి నిధులు దీనిని తీవ్రంగా ఎదిరించేరు. అందుపై మరుసటి కాంగ్రెసులో చర్చించడానికై "ఎజండా" లో చేర్చబడింది. వెనుకటి కాంగ్రెసులో

మాదిరిగానే లా సేజ్‌లోకూడా బూర్జువాప్రభుత్వాలచేత సాగించబడే యుద్ధాలను నిరసిస్తూ తీర్మానం చేయబడింది. కార్మికవర్గంయొక్క సామాజిక స్వేచ్ఛకీ - వారి రాజకీయ పోరాటాలకీ అవినాభావసంబంధం వున్నదనీ; అందుచేత రాజకీయాధికారం సంపాదించడమే వారి ప్రప్రథమ కర్తవ్యం అనీ కాంగ్రెసు ప్రకటించింది. ఈ విషయానికి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చి, ఏటేటా దీనిని తిరిగి తిరిగి ప్రకటిస్తూవచ్చింది.

లా సేజ్ కాంగ్రెసు మొదలుకొనీ కార్మికులలో ఇంటర్నేషనలు యొక్క పలుకుబడి హెచ్చింది. అనేక సమ్మెలలో అది ప్రధానపాత్ర వహించింది. ఇంటర్నేషనలు ఎప్పుడూ సమ్మెదారుల్ని ప్రోత్సహిస్తూం దేది. వారి సహాయానికి ఇతరదేశాలలో ధనం వసూలు చేస్తూందేది. ఇతరదేశాలనుంచి కూలీలను తీసుకువచ్చి సమ్మెలు విఫలం చెయ్యడానికి యజమానులుచేసే ప్రయత్నాలను అడ్డుకుంటూవుందేది.

పారిసు ఇత్తడిపనివారి సమ్మెలో, ఇంటర్నేషనలు, కార్మికులకు పూర్తిసహాయంచేసి, దాని విజయానికి తోడ్పడింది. ఇందువలన కార్మిక లోకంలో దానికి విశేషం పలుకుబడి కలిగింది. ఈ సమ్మె జరిగేక మూడో నెపోలియను పారిసులోని ఇంటర్నేషనలు శాఖను నిషేధించేడు. (1868) ఈపనితో దాని ప్రతిష్ఠ మరీ విజృంభించింది.

బెల్జియం - స్విట్జర్లాండులలోని శాఖలు చాలా వేగంగా అభివృద్ధి చెందేయి. ఇటలీలోకూడా కొత్తశాఖలు ఏర్పడినాయి. ఆఖరుకి ఇంటర్నేషనలుయొక్క ప్రతిభ ఆస్ట్రియా - జర్మనీలోనికికూడా చొరబడింది. ఇంగ్లీషు ట్రేడ్‌యూనియనులకి, జనరల్ కౌన్సిలు వ్రాసిన ఈలేఖాభాగం చూస్తే దానికి కూలీలలో ఎంతపలుకుబడివుందో తెలిసిపోతుంది.

'బిస్మార్కు జర్మనీలో టారిఫుసంస్కరణలకి తలపెట్టినప్పుడు బార్మన్ - ఎల్బర్‌ఫీల్డు ఛాంబర్ ఆఫ్ కామర్సు ఆతనిని ఎదుర్కొంది. బిస్మార్కు సంస్కరణలే అమలులోకివస్తే ప్రష్యను పరిశ్రమలు బ్రిటిషు పరిశ్రమలతో పోటీచేయలేవనీ, అలా పోటీచేయగలగాలంటే కూలీల జీతాలు తగ్గించవలసి వస్తుందనీ; కాని, ఆపని ఇంటర్నేషనలుకుగల పలుకుబడి - బలమూ కారణంగా సాగదనీ వారు ప్రకటించేరు.'

ఈవిధంగా ఇంటర్నేషనలు పుట్టిన కొలదికాలంలోనే, బలీయమైన సంస్థగా తయారై, శ్రామికులలో పలుకుబడి గలిగి, బూర్జువాలకి బెదురు కలిగించింది.

1868 సెప్టెంబరులో బ్రస్సెల్సునగరంలో మూడవ కాంగ్రెసు సమావేశం అయింది. 96 గురు ప్రతినిధులు సభకి వచ్చేరు. వారిలో 55 గురు బెల్జియం నుంచి, 18 గురు ఫ్రాన్సునుంచి, 11 గురు ఇంగ్లండు నుంచి, కొద్దిమంది స్విట్జర్లండు - జర్మనీలనుంచీ, ఒకడు ఇటలీనుంచీ వచ్చేరు. 'ఎజెండా' లోని మొట్టమొదటి చర్చనీయాంశం "యుద్ధభయం" ఆసమయంలో అంతర్జాతీయ పరిస్థితులు చాల తీవ్రస్థితికి వచ్చేయి. కనకనే ఇంటర్నేషనలు ఈవిషయానికి ప్రాముఖ్యత నిచ్చింది. కొద్దికాలం క్రితమే ఆస్ట్రియా - ప్రష్యాలమధ్య యుద్ధం ఆఖరయింది. (1866) ఫ్రాంసు - జర్మనీలమధ్య యుద్ధం ఇప్పుడా - యింకా అన్నంత తీవ్ర పరిస్థితులు ఏర్పడ్డాయి. ఏక్షణంలోనైనా యుద్ధం వచ్చేటట్లుంది. కాంగ్రెసు, యుద్ధానికి వ్యతిరేకంగా తీవ్ర అసమ్మతి చూపి, యుద్ధం వచ్చిందా సమ్మెలతో సమాధానం చెప్పమని కార్మికులలకి హెచ్చరిక నిచ్చింది.

శ్రామికవర్గం సాగించే పోరాటంలో సమ్మె ఒక దివ్యాయుధం

అని కాంగ్రెసు తీర్మానించింది. ఈ కాంగ్రెసులో ప్రౌఢనిస్టులుకూడా దీనికి అంగీకరించేరు.

ఆస్తి సమస్యమీద చాల తీవ్రమైన చర్చలు జరిగినాయి. అన్ని దృక్పధాల్నీ సమీకరణచేస్తూ, ఒక తీర్మానం ప్రవేశపెట్టబడింది. ప్రౌఢనిస్టులు దానికి వ్యతిరేకించేరు. 30 : 4 వోట్లతో చివరికి తీర్మానం నెగ్గింది. 15 గురు తటస్థులు.

ఆధునిక సమాజంలో కలిగిన ఆర్థికాభివృద్ధివల్ల భూమికూడా సంఘపరం చెయ్యవలసిన ఆవశ్యకత కలిగింది. గనులు, రైల్వేలమాదిరిగానే భూమినికూడా ప్రభుత్వం సరాసరిగా రైతుసంఘాలకే కౌలు కిచ్చే పద్ధతి ఏర్పడాలి—

వార్తాసౌకర్యాలు, రహదారీ సౌకర్యాలు, సమాజంయొక్క సమిష్టి అధికారంలోకి తీసుకురావాలి—

'క్వారీలు బొగ్గుగనులు, ఇతర గనులు, రైల్వేలు ప్రజలకి ప్రాతినిధ్యం వహించుతూన్న ప్రభుత్వం స్వాధీనంలో వుండాలి.'

ఈతీర్మానం వలన ఇంటర్నేషనలు పూర్తిగా కమ్యూనిస్టు సిద్ధాంతాల్ని అంగీకరిస్తూన్నట్లే స్పష్టం అవుతూంది.

అప్పుడే 'కాపిటలు' మొదటిభాగాన్ని ప్రకటించిన మార్క్సును అభినందిస్తూ, జర్మను ప్రతినిధుల ప్రోత్సాహంమీద కాంగ్రెసులో తీర్మానించబడింది.

"పెట్టుబడిని శాస్త్రీయదృక్పధంతో వివరించిన మొట్టమొదటి అర్థశాస్త్రవేత్త మార్క్సు. ఈవిధంగా ఆయన ఒకమహత్కార్యం నెరవేర్చేడు."

బ్రస్సెల్సు కాంగ్రెసుతో ప్రౌఢనిజంయొక్క పతనం స్థిరపడిపోయినా, కాంగ్రెసులో సిద్ధాంతైక్యత ఏర్పడలేదు. ప్రౌఢన్ స్థానాన్ని బకునిన్ ఆక్రమించేడు. అతని అభిప్రాయాల్ని వెనుకటికంటె తీవ్రంగానూ, కష్టంతోనూ ఎదిరించి పోరాడవలసివచ్చింది.

## మొదటి ఇంటర్నేషనలుయొక్క చరిత్రలో రెండోదశ. బకునినిజంతో పోరాటం.

మైకేల్ బకునిన్ (1814-1876) ప్రవాసితుడైన రష్యను విప్లవకారుడు. అరాజ్యవాదుల నాయకుడు. సిద్ధాంతవేత్త. కార్మికోద్యమానికి సంబంధించిన అన్ని ముఖ్యసమస్యలమీదా మార్క్సుతో భేదిస్తాడు. అతని దృష్టిలో సాంఘికవిప్లవంయొక్క గమ్యం రాజ్యాంగాన్ని నాశనం చెయ్యడమే. ఈసామాజికాసమానతకీ - దౌర్జన్యాలకీ రాజ్యాంగమే మూలకారణం అంటాడు. రాజ్యాంగాన్ని నాశనం చేయడంతోనే పెట్టుబడిదారివిధానంకూడా వెనువెంటనే ధ్వంసం అయిపోతుందనీ, ఆశిధిలాల మీద రాజ్యాంగం ఎరగని నూతనసమాజం నిర్మితం అవుతుందనీ అతని వాదం. దీనికి పర్యవసానంగా దైనందిన ఆర్థికపోరాటాలలో పాల్గొనడం వట్టిమోసం అని తేల్చేడు. విప్లవకారుడు సాంఘికవిప్లవంయొక్క అవశ్యకతని ప్రజలకి బోధించి వారిని ఒక్కమారుగా తిరుగుబాటు చేసేలాగ చెయ్యాలంటాడు.

భూమి, గనులు, పరిశ్రమలు సమిష్టి అధికారంలో వుండాలంటాడు, బకునిన్. సమాజంలో పాలకులు - పాలితులు అనే భేదం వుండకూడదంటాడు. స్వతంత్ర రైతుసంఘాలు, కూలీసంఘాలు, వీనియొక్క సమ్మేళనరూపంలో వుండాలంటాడు. కాని, అతనికి ఆర్థకసమస్య లేవీ

పట్టవు. అందుచేత ఈసమిష్టి వాదభావనలు పెటీబూర్జువా ఉటోపియను సంకల్పాలతో సమ్మిశ్రితం అయిపోయినాయి. వారసత్వపుహక్కుల్ని తొలగించడంతోనే సమాజంలో సాంఘిక - ఆర్థిక - రాజకీయసమానత్వం ఏర్పడుతుందనే సైంట్ సైమన్ అభిప్రాయాలనే ఈతడు ఏకరువు పెట్టాడు.

సాంఘికవిప్లవాన్ని తీసికొనిరాగల సాంఘికశక్తులేవి? అనేవిషయంలో బకునిన్‌వి మరీ వింతఅభిప్రాయాలు. విప్లవానికి శ్రామికవర్గం నాయకత్వం వహించవలసియుంటుందనే విషయం ఆత డంగీకరించడు. కార్మికవర్గంయొక్క ప్రాముఖ్యతని మార్క్స్ అతిశయోక్తిగా పలికేడన్నాడు. ప్రజాసామాన్యంలో దుర్భరబాధపడుతూన్నవారిలో - అందులోనూ ప్రత్యేకంగా ఆధునిక సమాజకారణంగా సర్వనాశనం అయి తెగించివున్న దరిద్రులు, భూములు పోగొట్టుకొన్నవారు, ముష్టివాళ్లు, యువకులయిన విద్యావంతులు విప్లవభావాల్ని చురుకుగా గ్రహించగలరు గనక వారే విప్లవానికి మూలశక్తులంటాడు.

బకునిన్ భావాలు కార్మికవర్గభావాలు కావు.

"పెట్టు బడిదారీవిధానంయొక్క అభివృద్ధివలన నాశనం అయిన రైతు, దానివలననే సర్వస్వంకోల్పోయిన చేతిపనివాడు, చిన్నవర్తకుడు... వీరిమీద ఎప్పుడూ పెట్టుబడిదారీ విధానంయొక్క ఒత్తిడి తగ్గదు. క్రమక్రమంగా వారి జీవితాధారాలు సన్నగిల్లుతూ వుంటాయి. కనకనే అతివేగంగా తీవ్రతర విప్లవభావాలకి లొంగివస్తారు. కాని, ఓర్పు చూపగల శక్తిగాని, నిర్మాణసామర్థ్యంగాని, పట్టుదలగాని, క్రమశిక్షణగాని వారిలో వుండవు."

—లెనిన్

పెట్టుబడిదారీ విధానంయొక్క దారుణకృత్యాలకి వొళ్ళుమండిన మధ్యతరగతివారికీ, ఆతరగతిలోంచే నూతనంగా సర్వస్వం కోల్పోయి ఫ్యాక్టరీలకువచ్చి చేరిన వర్గానికి గల భావాన్ని బకునిన్ విశదీకరించేడు. దానికి ఫలితంగా ఆవర్గాలకు ప్రాధాన్యతగల ఇటలీ, స్విట్జర్లండు, స్పెయిన్, బెల్జియములలో, ఆతని సిద్ధాంతాలు ఎక్కువ ప్రచారం అయినాయి. ఈదేశాలన్నీ పారిశ్రామికంగా ఇంకా శైశవావస్థలోనే వున్నాయి.

1860 ప్రాంతాలలో ఈతడు 'శాంతి, స్వాతంత్ర్యసమితి' యనే అహింసావాదసంఘంలో చేరేడు. కాని, 1868 లో దానిని వదులుకున్నాడు. తరువాత ఆతనికిగల పైన చెప్పిన అభిప్రాయాలన్నింటినీ ఆధారంగా చేసుకున్న కార్యక్రమంతో - ఇంటర్నేషనల్ ఎలయన్స్ ఆఫ్ సోషల్‌డెమాక్రసీ * - (దీనినే 'ఎలయన్స్' అంటారు.) అనే సంఘాన్ని స్థాపించేడు. ఇదే రోజులలో ఆతడు మార్క్సుకొక జాబు వ్రాసేడు.

"20 ఏళ్ళక్రితం నీవు చేయతలపెట్టిన పనికే నేనిప్పుడు ఉపక్రమించేను. బర్లిన్‌లో జరిగిన శాంతిస్వాతంత్ర్య సమితియొక్క సమావేశంలో బూర్జువాజీతో నాకుగల సంబంధాలన్నీ వొదులుకున్నాను. ఇప్పుడు బూర్జువాసంఘాలతో నాకేమీ ప్రసక్తిలేదు. నాకున్న సంబంధాలు కేవలం శ్రామిక ప్రపంచంతోనే. నామాతృభూమి - ఇంటర్నేషనలు. దానియొక్క నిర్మాతవు నువ్వు. కనుక నేస్తమా! నేను నీశిష్యుడిని - అలా చెప్పుకోడానికి గర్విస్తూన్నా."

తాముకూడా ఇంటర్నేషనలులో కలుస్తామనీ, తమరిని ఒక ప్రత్యేకశాఖగా స్వీకరించమనీ; పై సభ కోరింది. కాని, ఇంటర్నేషనలులో మరొక ప్రత్యేకసంస్థ - స్వకీయ కార్యక్రమంతో కూడిన

* సోషల్‌డెమాక్రాట్ల అంతర్జాతీయ సమితి అని అర్థం.

మరొక అంతర్జాతీయసంస్థ వుండడానికి వీలులేదని జనరల్ కౌన్సిలు తీర్మానించింది. అప్పుడు 'ఎలయన్స్' రద్దుచేయబడింది. దాని శాఖలు మాత్రం ఇంటర్నేషనలుయొక్క అధికారం క్రింద తీసుకోబడినాయి. కాని, ఆ సంఘం మాత్రం రహస్యంగా పనిచేస్తూ, ఇంటర్నేషనలును బకునిన్ అనుచరులతో నింపడానికి ప్రయత్నిస్తూనేవుంది.

1869 లో బాస్లీలో నాలుగవ కాంగ్రెసు సమావేశం అయింది. ఇప్పటికి ఇంటర్నేషనలులో మంచి అభివృద్ధి కనబడింది. ఇంగ్లండు - బెల్జియం - ఫ్రాన్సు, జర్మనీలలో దాని పలుకుబడి బాగా హెచ్చుతూంది. మొట్టమొదటిమారుగా ఈకాంగ్రెసుకి స్పెయినునుంచీ, ఉత్తర అమెరికా నుంచీ ప్రతినిధులు వచ్చేరు.

ఈ అభివృద్ధిని గమనించి జనరల్ కౌన్సిలుకిగల అధికారాలు హెచ్చుచేసేరు. ఇంటర్నేషనలుయొక్క కార్యక్రమం నుంచి పెడ ద్రోవలు తొక్కిన శాఖల్ని త్రోసివేసేటందుకు దానికి అధికారం ఇయ్య బడింది.

బకునిన్, వారసత్వపు హక్కులు రద్దుచెయ్యబడాలనే తీర్మానం తెచ్చినప్పుడు మొట్టమొదటి పర్యాయం అతనితో పేచీవచ్చింది. "రాజకీయ, ఆర్థిక న్యాయాలకి యీవారసత్వహక్కు ఆటంకమనీ, సాంఘిక సమానత్వాని కిదే అభ్యంతరం" అనీ ఆతడు చెప్పే కారణాలు.

బకునిన్‌కి వ్యతిరేకంగా వదించిన జనరల్ కౌన్సిలుసభ్యులు, ప్రస్తుత దురవస్థలకి కారణం నేడు అమలులోవున్న ఆర్థికవిధానమేకాని, వారసత్వపు హక్కుకాదు. వారసత్వపు హక్కును రద్దుచెయ్యడంతో సామాజిక విప్లవం ఆరంభిస్తామనడం బండి వెనకాల గుర్రాన్ని కట్టినట్లుంటుంది, - అని వాదించేరు.

ఈ కాంగ్రెసులో బకునినిస్టులకీ - జనరల్ కౌన్సిలుసభ్యులకీ జరిగిన వాదనలు అక్కడితో ఆగలేదు. అవి అన్నిదేశాల శాఖలలోకీ ప్రాకేయి. 1870 ఏప్రియలునెలలో స్విట్జర్లండులో ఈరెండుశాఖలూ పూర్తిగా విడిపోయినాయి.

## ఫ్రాంసు — జర్మను యుద్ధమూ : ఇంటర్నేషనలూ.

ఈలోపుగా ఇంటర్నేషనలుయొక్క భవిష్యత్తును నిర్ణయింపగల సంఘటనలు అంతర్జాతీయరంగంమీద ప్రత్యక్షమైనాయి.

1870 జూలైలో ఫ్రాన్సు, ప్రష్యాలమధ్య యుద్ధం వచ్చింది. అందుచేత ఆ ఏడాది జర్మనీలో జరపాలనుకున్న కాంగ్రెసు సమావేశం ఆగిపోయింది. ఇంటర్నేషనలులో సభ్యులయిన ఫ్రెంచి - జర్మను శ్రామికులు యుద్ధానికి తీవ్రంగా వ్యతిరేకత చూపించేరు. ఫ్రాన్సులోని బోనపార్టిస్టులు ప్రష్యాలోని జంకరులు (ప్రభువులు) ఈదురంతక యుద్ధానికి మూలకారణం అంటూ మార్క్సు వ్రాసిన (23 జూలై 1870) హెచ్చరికను జనరల్ కౌన్సిలు తన శాఖలన్నింటికీ పంపించింది.

"ఫ్రాన్సు అధికారులూ - జర్మను అధికారవర్గమూ భయంకర యుద్ధంలో చిక్కుకుని వున్నారు. ఈ రెండు దేశాలలోని కార్మికులూ పరస్పరసౌహార్ద్రం ప్రకటించుకుంటున్నారు."

మార్క్సు వ్రాసిన మరొక హెచ్చరికను జనరల్ కౌన్సిలు 1870 సెప్టెంబరు 9 వ తేదీన ప్రకటించింది. అప్పటికి ఫ్రాన్సు పూర్తిగా ఓడిపోయింది. సామ్రాజ్యం విచ్ఛిన్నం అయింది. ఫ్రాన్సులో రిపబ్లిక్కు ప్రకటించబడింది. ఆస్థితిలో జర్మను ధనికవర్గం ఫ్రాన్సులోని భాగాల్ని కలుపు

కుందుకు చేస్తూన్న ప్రయత్నాలకి అసమ్మతి తెలుపుతూ, వారి ప్రయత్నాలే గనుక నెరవేరితే ఫ్రాన్సు తప్పని సరిగా రష్యా చేతులలోకి పోవలసి వస్తుందనీ, అప్పు డింతకన్నా భయంకర యుద్ధాలు జరగవలసి వస్తాయనీ, ఆ హెచ్చరికలో వ్రాయబడింది.

జర్మన్ ఇంటర్నేషనలిస్టులు యుద్ధానికీ, అల్సేస్ - లోరయిన్‌ల ఆక్రమణకీ విరుద్ధంగా తీవ్రప్రతిఘటన రేపేరు. జర్మన్ ప్రభుత్వం యుద్ధ అవసరాలు కూర్చుకోడానికి చేసిన చట్టాలకి అనుకూలంగా వోటు చెయ్యనందుకై బెబెల్, లెబెక్నెట్‌లపై దేశద్రోహనేరం మోపి రెండేసేళ్ళ శిక్షవిధించేరు. జర్మనీయొక్క ఆక్రమణ నీతికి స్విట్జర్లండు - బెల్జియం - ఆస్ట్రియాలలోని ఇంటర్నేషనలు శాఖలు కూడా అసమ్మతి చూపినాయి. ఫ్రాన్సు - జర్మను యుద్ధం విషయంలో ఇంటర్నేషనలూ దాని శాఖలూ కూడా జాతీయతకి ఏమాత్రమూ విరుద్ధముకాని, నిజమైన అంతర్జాతీయ నీతిని అవలంబించేయి.

1871 మార్చి 18 న శ్రామికులు తిరుగుబాటు చేసేరు. పారిస్ కమ్యూన్ స్థాపించబడింది. ఆ కమ్యూన్‌ను రక్షించవలసిందనీ, ఇది ప్రపంచకార్మికుల కర్తవ్యం అనీ ఇంటర్నేషనల్ హృదయపూర్వకంగా హెచ్చరించింది. "టొలయిన్" వెర్సెయిల్సు పక్షీయులతో చేరడంచేత అతనిని పార్టీనుంచి తొలగించేరు. ఇంటర్నేషనలులోని ఫ్రెంచి సభ్యులు కమ్యూనార్డులతోడివారేనని నిర్ణయించబడింది.

1917 కి పూర్వం ఆధునిక కార్మికోద్యమ ఘట్టాలలోకల్లా మహత్తరమైనది పారిస్‌కమ్యూనే. దానిని గురించి వ్రాసే ముందు మొదటి ఇంటర్నేషనలు చరిత్ర పూర్తిచేస్తాను.

# మొదటి ఇంటర్నేషనలుయొక్క అంతిమదశ.

1871 మే నెలలో పారిస్ కమ్యూన్ ఓడిపోయింది. దీనితో ఇంటర్నేషనలుయొక్క అభివృద్ధికి మంచి దెబ్బతగిలింది. ఫ్రెంచి ధనిక వర్గం అతినీచంగా కార్మికుల్ని, వారివుద్యమాన్నీ నాశనంచేసివేసేరు. యుద్ధసమయంలో కార్మికనాయకులు చూపిన ధైర్యసాహసాలకీ, కమ్యూను యెడల వారు ప్రకటించిన స్నేహభావానికీ, ప్రతిక్రియగా జర్మనీలోకూడా వుద్యమాన్ని తీవ్రంగా అణిచివేసేరు. అందుచేత ఇంటర్నేషనలులో ఫ్రాన్సు - జర్మనీల ప్రాముఖ్యత తగ్గింది.

1871 లో బ్రిటిషు శ్రామికవర్గం పెట్టుబడిదారీ వర్గంనుంచి కొన్ని రాజకీయసౌకర్యాలుగుంజుకుంది. (ట్రేడ్ యూనియను కార్యక్రమాన్ని నిషేధించే కొన్ని చట్టాలు రద్దుచేయబడినాయి.) అప్పటినుంచీ ఇంటర్నేషనలుకి వారిలోగల పలుకుబడి సన్నగిల్లింది. అంతకంతకి వారు ఉదారవాదుల పలుకుబడిలోనికి పోసాగేరు. కమ్యూన్‌ను సమర్థించిందనే కారణంచేత ఇంటర్నేషనలుతోగల సంబంధాన్ని కొన్ని ట్రేడ్ యూనియనులు తెంచుకున్నాయి.

1870 ప్రాంతాలలో ఇంగ్లాండు ఆర్థింకగా మంచి అభివృద్ధిలోకి వచ్చింది. బూర్జువావర్గం తమచేతికి చిక్కిన అదనపులాభాలలో కొంత భాగం కార్మికవర్గంలోని పైతరగతివారికి మేపి, వారిని తమవేపు తిప్పుకోగలిగేరు. తత్ఫలితంగా ఇంగ్లాండులోని ట్రేడ్‌యూనియన్ ఉద్యమమే అమలులోవున్న సామాజిక విధానానికి పట్టుకొమ్మగా తయారయింది. ఆఖరుకి ఇంగ్లీషుకార్మికునికి వర్గచైతన్యం కలుగకుండా చెయ్యడానికి కూడా అవేకారణం అయినాయి.

పారిస్ కమ్యూన్ పడిపోయినవెనుక బకునినిస్టులకీ - మార్క్సిస్టులకీమధ్య పేచీ బలీయం అయింది. బ్రిటను ఇంటర్నేషనలునుంచి దూరం కావడానికి ఇదికూడా ఒకకారణం.

మార్క్సు కమ్యూన్‌కి గొప్ప ప్రాముఖ్యత నిచ్చేడు. "ఇది కార్మిక వర్గముయొక్క ప్రభుత్వం. కార్మికవర్గానికి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సంపాదించి ఇయ్యగల రాజ్యాంగవిధానం ఎట్టకేలకి దొరికింది" అన్నాడు. కాని, బకునిన్‌కి "1871 నాటి కమ్యూన్ వలన రాజ్యాంగం నాశనం చెయ్యవలసిన ఆవశ్యకత స్పష్టం అయింది"! పారిస్‌లో విప్లవ నియంతృత్వాన్ని స్థాపించడమే జరిగిన తప్పని ఆతని అభిప్రాయం!

1871 సెప్టెంబరులో, ఇంటర్నేషనలు సమావేశం లండనులో కూడింది. "సామాజిక విప్లవాన్ని సాధించడానికీ, వర్గభేదాలు పోగొట్టడానికీ, కార్మికులకి ఒకరాజకీయపార్టీ అవసరం. కార్మికవర్గం సాగించే ఆర్థిక పోరాటాలకీ - రాజకీయపోరాటాలకీ అవినాభావసంబంధం వున్నదనే విషయం ఇంటర్నేషనలు తన సభ్యులందరికీ హెచ్చరించుతూంది" అంటూ ఈసమావేశంలో తీర్మానించబడింది.

కార్మికవర్గం రాజకీయాలలో వేలుపెట్టకూడదనే బకునిన్ సిద్ధాంతం ఈవిధంగా త్రోసివెయ్యబడింది.

1870 లోనే ఇంటర్నేషనలునుంచి విడిపోయిన స్విట్జర్లండులోని బకునినిస్టులుశాఖ తమ నిర్మాణాన్ని వేరే ఏర్పరుచుకున్నాయి. దానినే 'జూరా ఫెడరేషన్' అంటారు. ఇంటర్నేషనలుయొక్క జనరల్ కౌన్సిలు నియంతృత్వం నిర్వహిస్తూందనీ, లండనుసమావేశం గూఢంగా జరపబడిందనీ నిందలుమోపుతూ, ఈఫెడరేషను ఇంటర్నేషనలు శాఖలన్నిం

టికీ హెచ్చరికలు పంపింది. ఇటలీ, స్పెయిన్, బెల్జియములలోని శాఖలు చాలవరకు బకునినిస్టులతో చేరేయి.

ఈవిధంగా ఇంటర్నేషనలులో నాలుగుమూలలకీ యీచీడప్రాకింది.

1872 సెప్టెంబరులో ఐదో కాంగ్రెస్ హేగ్‌నగరంలో కూడింది. ఇంటర్నేషనలు శాఖలయొక్క ఆంతరంగిక విషయాలమీద జనరల్ కౌన్సిలుకు అధికారం వుంచకూడదంటూ బకునినిస్టులు ఈకాంగ్రెసులో ఒక తీర్మానం ప్రవేశపెట్టేరు. కాని అది గెంటివెయ్యబడింది. అధికార కేంద్రీకరణమూ, క్రమశిక్షణ, వీనియొక్క ఆవశ్యకతను ఈకాంగ్రెసు అంగీకరించి, శాఖలన్నిటినీ అదుపులో వుంచుకుందుకు అవసరమైన అధికారాలన్నింటినీ కాంగ్రెసు, జనరల్ కౌన్సిలుకి ఇచ్చింది. ఈవిధంగా బకునిన్‌ను ఇంటర్నేషనలునుంచి దూరంచెయ్యడానికే నిర్ణయించబడింది.

మార్క్సు, ఏంజిల్సుల సూచనలపై జనరల్ కౌన్సిల్‌యొక్క కార్యాలయం లండన్‌నుంచి న్యూయార్కుకి మార్చబడింది. బకునినిస్టుల పలుకుబడికీ, అంతకంతకి ధనికవర్గం అండచేరుతూన్న ఇంగ్లీషు ట్రేడ్ యూనియనిస్టుల పలుకుబడికీ అందకుండా చెయ్యడానికే జనరల్‌కౌన్సిలు స్థానం మార్చబడింది. ఈసలహా 26, 23 వోట్లతో అంగీకరించబడింది. 9 గురు తటస్థులు. విప్లవానికి భయపడి ఇంటర్నేషనలు సముద్రాంతరాల తలదాచుకుంటూ వుందని నిరసిస్తూ, బ్లాంక్విస్టులు కాంగ్రెసులోంచి తొలగి పోయేరు.

హేగ్ కాన్ఫరెన్సులో జరిగిన తీర్మానాలు ఇంటర్నేషనలుయొక్క పతనాన్ని ఏమాత్రమూ నిలపలేకపోయినాయి. ఆఏడాదే బకునినిస్టులు మరో ఇంటర్నేషనలు స్థాపించుకున్నారు. ఇటలీ, స్పెయిన్, స్విట్జర్లండు,

బెల్జియం శాఖలు చాలవరకు దానిలో చేరినాయి. ఇది 1877 వరకూ జీవించింది.

ఇంగ్లండు, ఫ్రాన్సుల పరిస్థితులు ఇంటర్నేషనలుకి ఏమాత్రమూ అనుకూలంగాలేవు. 1878 లో జినోవాలో ఆరోసమావేశం జరిగింది కాని, చెప్పదగిన విశేషాలేమీలేవు. ఆతర్వాత ఇక కాంగ్రెసులు జరగలేదు.

ఆనాటినుంచీ ఏదేశాని కాదేశంలోనే కార్మికవర్గం వేరువేరు జాతీయసంఘాల నేర్పరచుకుంటూ బలపరచుకుంటూ వచ్చేయి. పర్యవసానంగా 1876 జూన్ నెలలో జరిగిన ఫిలడెల్ఫియా కాంగ్రెసులో ఇంటర్నేషనలు రద్దుచేయడానికి నిర్ణయించబడింది.

* * * * *

ఇంటర్నేషనలు జన్మించిన 10 ఏళ్ళ తర్వాత 1874 లో ఏంజిల్సు ఎఫ్. ఏ. సోర్జికి * ఒకజాబు వ్రాసేడు.

"ఒకదృష్ట్యా చూస్తే, భవిష్యత్తుని మనసులో వుంచుకుని చూస్తే ఇంటర్నేషనలు పదేళ్ళపాటు యూరపియను చరిత్రలో ప్రాధాన్యతవహించింది. ఆ గతచరిత్రం నిజంగా గర్వింపదగిన ఘట్టం.

భవిష్యత్తులో ఏర్పడబోయే ఇంటర్నేషనలు ప్రత్యేకంగా కమ్యూనిస్టులదే అవుతుంది. కొంతకాలంపాటు మార్క్సురచనలు తమ ప్రచారం సాగిస్తాయి కనక ఇది సాధ్యం అవుతుంది. అది మన సిద్ధాంతాలనే ప్రచారం చేస్తుంది."

---

* ఇంటర్నేషనలు కేంద్రం న్యూయార్కుకు మార్చబడిన తర్వాత (1872) సోర్జి దానికి మొట్టమొదట కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. 1906 లో మరణించేవరకూ అతడు జర్మన్, అమెరికన్ కార్మికోద్యమంలో ప్రధానపాత్ర వహించేడు.

అంతర్జాతీయ కార్మికోద్యమంమీద మొదటి ఇంటర్నేషనలు మంచి పలుకుబడి స్థాపించుకొంది. శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతాల్ని బాగా ప్రచారంలోకి తెచ్చింది. వర్గపోరాటం నుంచి కార్మికవర్గాన్ని పెడదారులు తొక్కించే ప్రయత్నాల్ని ధ్వంసం చేసింది. శ్రామికవర్గోచితమై, విప్లవకరమైన అంతర్జాతీయ విధానాన్ని శ్రామివర్గోద్యమం యొక్క అన్నిశాఖలలోనూ అవలంబించే దెట్లాగో స్పష్టపరచింది. శ్రామిక ప్రజోద్యమాభివృద్ధికి మార్గాన్ని సరిచేసి పెట్టింది. దానిని శాస్త్రీయ సోషలిజం (కమ్యూనిజం) యొక్క పలుకుబడిలోనికి తెచ్చి నడిపించింది.

"పెట్టుబడిదారీ విధానంమీద విప్లవం సాగించడానికై శ్రామికవర్గము యొక్క అంతర్జాతీయసంస్థ నొకదానిని నిర్మించడానికి అవసరమైన పునాదులు వేసింది, మొదటి ఇంటరేషనలు. సోషలిజం సాధించడానికై అంతర్జాతీయ శ్రామికవర్గపోరాటాని కదే నాంది చేసింది."

"లెనిన్"

మొదటి ఇంటర్నేషనలుయొక్క కార్యక్రమాన్ని రెండో ఇంటర్నేషనలు సాగించలేకపోయింది. (1889 - 1914) కార్యక్రమంవిషయంలో అది చూపిన మెతకతనం; యుద్ధసమయంలో అదిచేసిన అప్రతిష్టపనీ; యుద్ధానంతరం విప్లవాలు విజృంభణగా సాగుతూన్న సమయంలో అది పెట్టుబడిదారీవిధానాన్ని రక్షించడానికి చేసినప్రయత్నాలూ; దరిద్రులతోనూ, నిరుద్యోగులతోనూ శిధిలం అవుతూన్న ప్రభుత్వాలనూ; ఫాసిస్టుల అధికారాన్ని సమర్థించుతూన్న ఆసంస్థయొక్క ఈనాటి నీతీ; ఇవన్నీ ఫస్టు ఇంటర్నేషనలుయొక్క నీతికి పూర్తిగా విరుద్ధం. రెండో ఇంటర్నేషనలులోని శాఖలు కేవలం విప్లవనిరోధకములుగా తయారైనాయి. బూర్జువావర్గానికీ, ఫాసిజానికీ పట్టుకొమ్మలుగా ఏర్పడినాయి.

కమ్యూనిస్టు ఇంటర్నేషనలుయొక్క (కోమింటరన్) కార్యక్రమంలో నేటి సోషల్ డెమాక్రసీయొక్క నీతివిధానం ఏలావున్నదో వర్ణించ బడింది.

"సామ్రాజ్యవాదులతో పోరాటం జరుపుతూన్న శ్రామికవర్గంలోని ఐకమత్యాన్ని చెడగొట్టడమే ఈనాడు సోషల్ డెమాక్రసీయొక్క ప్రధాన కార్యక్రమం. పెట్టుబడిదారీవిధానంతో శ్రామికులు చేస్తూన్న పోరాటం లోని ఐక్యతావిధానాన్ని భంగపరచడానికిది సామ్రాజ్యవాదుల ఏజంటుగా పనిచేస్తూంది. వివిధ దేశాల సోషల్ డెమాక్రసీలు, రెండో ఇంటర్నేష నలు, దానియొక్క ట్రేడ్‌యూనియన్‌శాఖ, ట్రేడ్‌యూనియనుల ఆమ్ స్టర్‌డామ్ ఫెడరేషన్,- ఇవన్నీ నేటి బూర్జువా సమాజానికి మూల స్తంభాలు."

ఏనాడో వస్తుందని ఏంజిల్సు సూచించిన కమ్యూనిస్టు ఇంట ర్నేషనలు 1919 లో స్థాపించబడింది. అదే మొదటి ఇంటర్నేషనలుకి నిజమైన వారసు.

# పారిస్ కమ్యూన్

## రెండో సామ్రాజ్యం.*

రెండవసామ్రాజ్యకాలంలో (1852-70) ఫ్రాన్సులో పెట్టుబడిదారీ విధానం అతివేగంగా అభివృద్ధిచెందింది. పరిశ్రమలు - వ్యాపారమూ విపరీతంగా పెరిగినాయి. ఫ్రాన్సు అంతటా రైల్వేలు వలమాదిరిగా పరచి వెయ్యబడినాయి. 1851—69 ల మధ్యకాలం ఫ్రెంచి జాతీయాదాయం రెట్టింపు అయింది. (82 మిలియార్డులనుండి 162 మిలియార్డుల ఫ్రాంకు లయింది.) రెండవ సామ్రాజ్యప్రభుత్వంతో సన్నిహితసంబంధాలుగల కోటీశ్వరులు మారకము - స్పెక్యులేషను పద్ధతులు విశేషముగా ఉపయోగించి, విపరీతమైన సంపదలు ప్రోగుచేసుకున్నారు.

చిన్నచిన్న పరిశ్రమలు, చేతిపనులు నశించి పెద్దపరిశ్రమలకి తావిచ్చినాయి. నగరాలలోని పెట్టీబూర్జువా తరగతి పూర్తిగా నాశనం అయింది.

రాజకీయదృష్ట్యా చూస్తే ఈ రెండో సామ్రాజ్యం విప్లవనిరోధక కార్యక్రమానికి పట్టుకొమ్మ. దేశంలోని అధికారం అంతా సేనానాయకులదీ, మతబోధకులదీ, ఉద్యోగీయవర్గాలదీ. పాఠశాలలన్నీ చర్చిల స్వాధీనంలో వుండిపోయినాయి. అచ్చుయంత్రాలమీద కఠినమైన నిరోధాలు ఏర్పడ్డాయి. శాసనసభా ఎన్నికలు ప్రభుత్వనిరీక్షణలో - దాని ఒత్తిడికి లోనై నిర్వహించబడినాయి.

---

* 1789 ఫ్రెంచి మహావిప్లవం వరకూ వున్నది మొదటిసామ్రాజ్యమనీ, 1852-70 వరకూ బోనపార్టీ ప్రభుత్వాన్ని రెండో సామ్రాజ్యమనీ అంటారు.

సామ్రాజ్యపు ప్రారంభం రోజులలో 3 వ నెపోలియను బలీయంగావున్న ధనికుల - రైతుల పార్టీలసహాయంమీద ఆధారపడ్డాడు. 1848 మరపుకు వచ్చినకొద్దీ ప్రభుత్వం అంతకంతకి వడ్డీవ్యాపారులను మద్దతు చెయ్యసాగింది. ఆఖరుకి నెపోలియను పారిశ్రామిక పెట్టుబడిదారుల సహాయాన్ని పూర్తిగా పోగొట్టుకొన్నాడు.

ఈతడు విదేశాంగనీతిలో చూపిన చేతకానితనం మూలంగా ఫ్రాన్సు ఎన్నో యుద్ధాలలో చిక్కుకుంది. ఎప్పుడూ ఓడిపోవడమే. ప్రభుత్వం పన్నులభారాన్నంతనీ, ప్రజాసామాన్యంయొక్క నెత్తినే రుద్దింది. ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం జాస్తి అయింది. ఈ కారణాలన్నింటివలన చాలమందికి ప్రభుత్వంయడల అసహ్యం కలిగింది. ప్రజాతంత్రవిధానం యెడల ప్రజాసామాన్యంలో అభిమానం ఏర్పడింది. తనకి ఎదురెత్తుగా తయారవుతూన్న ఈ ప్రజోద్యమాన్ని అణిచివెయ్యడానికి నెపోలియను ఎన్నో వ్యర్థప్రయత్నాలు చేసేడు. ప్రభుత్వం యొక్క ఒత్తిడి ఎంత అధికంగావున్నా, 1869 ఎన్నికలలో ప్రభుత్వానికి 45 లక్షలు వస్తే - ప్రతికక్షులు 30 లక్షలవోట్లు సంపాదించేరు. సామ్రాజ్యం యొక్క అంతిమ ఘడియలు ఆసన్నం అయినాయి.

## ఫ్రెంచి కార్మికోద్యమం

1860–70 ల మధ్య పెట్టుబడిదారీవిధానం తీవ్రంగా అభివృద్ధి చెందినా పారిశ్రామిక కూలీలసంఖ్య పెరగలేదు.

చేతిపనులు చేసుకొనేవారు, గృహసేవకులు, పరిశ్రమలలోని కూలీలు, వీరిదే అధికసంఖ్య. పారిసులోనున్న 4,42,000 కూలీలలోనూ

పెద్ద పరిశ్రమలలో నైతేనేం, రహదారి శాఖలో నైతేనేం, వార్తాశాఖలో నైతేనేం, పనిచేస్తూన్న కార్మికులసంఖ్య 50,000 మించలేదు.

ఫ్రెంచి కార్మికులలో చాలమందివి పెటీబూర్జువాభావాలే. ఆనాటికీ రెండువర్గాలూ ఇంకా పూర్తిగా, స్పష్టంగా విడిపోయివుండలేదు. ప్రౌధ నిజానికి అధికసంఖ్యాకులయిన కార్మికులమీద పలుకుబడిగలిగి వుండ డాని కిదే కారణం. కాని, నిరంతరం జరుగుతూనేవున్న వర్గపోరాటమే, వారికి ప్రౌధన్ కార్యక్రమంలోగల అసంబద్ధతను తెలియచేసి, వారిని సరియైన దారికి తెచ్చింది. 1868 లో ప్రౌధనిస్టులు నడుపుతూన్న 'క్రెడిట్ బ్యాంకు' దివాలాతీసింది. దానితో, పెట్టుబడిదారీవిధానంతోడి పోరాటం లో ప్రౌధనుకార్యక్రమం ఎంతఅసమర్థమైనదో బయటపడి వూరుకుంది.

మొదటి ఇంటర్నేషనలు యొక్క కాంగ్రెసులలో ప్రౌధనిస్టు సిద్ధాంతాలకి కలిగిన పరాజయాలతో చాలమంది ఫ్రెంచికార్మికులకి పెట్టీ బూర్జువా దృక్పధాలు శీఘ్రంగా తొలగిపోయినాయి.

కార్మికుల సమ్మేలనూ, సంఘాలనూ నిషేధిస్తూ అసులులోవున్న 'ఛాపెలీర్ చట్టం' 1816 లో రద్దుచెయ్యబడింది. అయినా ప్రభుత్వం శ్రామికుల్ని కాల్చివెయ్యడానికి ఎన్నడూ వెనుతియ్యలేదు. క్రమక్రమంగా ట్రేడ్‌యూనియన్ ఉద్యమం బలపడసాగింది.

కార్మికవర్గంలో బలపడుతూన్న విప్లవభావాల్ని పసికట్టినకొలదీ ప్రభుత్వం ఇంటర్నేషనలుయొక్క ఫ్రాన్సుశాఖను అణచడానికి తీవ్ర చర్యలు తీసుకోసాగింది. 1868 లో జరిగిన విచారణలూ, శిక్షలతో ఇంటర్నేషనలుయొక్క ఫ్రాన్సుశాఖలు చాలవరకు నాశనం అయినాయి. 1870 లో ఇంటర్నేషనలు శాఖగా పనిచేస్తూన్న పారిస్ ఫెడరేషన్‌లో మిగిలిన శాఖలన్నీ కలిపివెయ్యబడినాయి. కాని, ఆనాడు ఇంటర్నేష

నలు సభ్యులకి నిశ్చితమైన ఒకకార్యక్రమమూ, స్థిరమైన నాయకత్వమూ లేకపోయినాయి.

ఫ్రాన్సు - జర్మను యుద్ధానికి పూర్వం ఫ్రాన్సులోని కూలీలకి దేశ విస్తృతమైన సంస్థ ఏదీలేదు. వారి ఉద్యమంలో ప్రౌఢనిస్టులు, బ్లాంక్విస్టులు, బకునినిస్టులు వచ్చి చేరేరు. శ్రామికవర్గోద్యమం యొక్క ప్రధాన సమస్యల విషయంలో వీరికీ వీరికి పొత్తు కుదురదు. వీరిలో ఒక్కరూ శ్రామికవర్గాన్ని ఎదుర్కొంటూన్న ప్రధానసమస్యల్ని ఎదుర్కోగల స్థితిలోలేరు.

## సామ్రాజ్యపతనం : జాతీయ ప్రభుత్వం.

దేశంలో అంతకంతకి ప్రజాతంత్రభావాలు బలీయం కావడం గుర్తించి, నెపోలియను 1870 జూలై 19 వ తేదీన ప్రష్యాతో యుద్ధానికి తలపడ్డాడు. సైనికవిజయాల్ని సంపాదించి ప్రభుత్వం యొక్క ప్రతిష్టను పెంపొందించుకుని, ప్రతిస్పర్థులశక్తులు సన్నగిలచెయ్యాలని అతని సంకల్పం. బిస్మార్కుకూడా యుద్ధానికే ఉబలాటపడుతూన్నాడు. ఫ్రాన్సుని జయించగలిగితే ప్రష్యనుల అధికారంక్రింద జర్మనుజాతి ఏకం కావడానికి సావకాశాలున్నాయి.

ఫ్రెంచిప్రభుత్వంలోగల దౌర్బల్యం అంతా యుద్ధంతో బయటపడిపోయింది. పరికరాలైనాలేనిసేనలు; తెలివి తక్కువ సేనాధిపతులు; వరసగా పరాజయాలు పొందేరు. యుద్ధంఆరంభమైన రెండు నెలల్లో - అంటే సెప్టెంబరు 2 వ తేదీన, "సెడాన్" వద్ద నెపోలియను సైన్యాలతోసహా ప్రష్యనులచేత ఖైదు చేయబడ్డాడు.

సెప్టెంబరు 4 వ తేదీన వెనుకటి ప్రభుత్వం రద్దుచేయబడి పారిసులో ప్రజాతంత్రప్రభుత్వం ప్రకటించబడింది. ఆనాటికి కార్మిక సంఘాల మధ్య ఏకీభావం లేక శ్రామికులు తిరుగుబాటుచేసి రాజ్యాంగం తమచేతిలోనికి తెచ్చుకోలేకపోయేరు. బూర్జువాలు అధికారం తమచేతిలోకి తీసుకున్నారు. వారే జాతీయప్రభుత్వాన్ని ఏర్పరచేరు. నెపోలియను పట్టుబడడంతో యుద్ధం ముగియలేదు. ప్రష్యను సేనలు దండయాత్ర సాగించేయి. సెప్టెంబరు 19 న పారిస్‌నగరం ముట్టడించబడింది. నగరంలో నేషనల్ గార్డులు 3 లక్షలవరకు ప్రోగుచెయ్యబడ్డారు. కార్మికులచేతులకు కూడా ఆయుధాలు దొరికినాయి.

కార్మికులలోనూ, పెట్టీబూర్జువాలలోనూ, జాతీయాభిమానం రేకెత్తింది. ప్రష్యనులనుంచి ఫ్రాన్సును రక్షించడమే వారు తమ అత్యవసర కర్తవ్యంగా నిర్ణయించుకొన్నారు. 1789 లో వచ్చిన మహావిప్లవంలో పుట్టింది, ఫ్రాన్సులో ఈ "దేశాభిమానం" అనేభావం. కమ్యూనాలోనున్న సోషలిస్టులుకూడా అవేభావాలు వెలిబుచ్చేరు. ఉదాహరణకి బ్లాంక్విని తీసుకుందాం. ఆతనిని విప్లవకారు డనడంలో సందేహించవలసిన పనిలేదు. సోషలిజం అంటే ఆతనికి నమ్మకంవుంది. కాని, ఆరోజులలో ఆతడు తన పత్రికకిపెట్టుకున్న పేరేమిటో తెలుసా? "మాతృభూమి ఆపదలో వుంది."—(లెనిన్) "శత్రువును ఎదుర్కొవలసిన సమయంలో పార్టీలూ, అభిప్రాయభేదాలూ వుండవు" అన్నాడు బ్లాంక్వి. ఈవిధమైన దేశాభిమానానికి కారణం ఫ్రెంచి శ్రామికులలో చైతన్యం కలుగకపోవడమే. ఆతనికిగల పెట్టీబూర్జువా అభిప్రాయాలే.

కోటవెలుపలనున్న ప్రష్యనులకంటె, నగరంలోనున్న సాయుధులైన శ్రామికులంటే జాతీయప్రభుత్వానికి హెచ్చుబెదురు కలిగింది. పర్య

వసానంగా ప్రభుత్వం దేశానికే ద్రోహం తలపెట్టి, పారిస్‌ను శత్రువుల చేతికి వప్పచెప్పడానికి తయారయింది. సాయుధులుగావున్న కూలీలని వుపయోగించుకొనివుంటే వారు మంచియోధులుగా వినియోగపడియుండే వారు. కాని, ఆకూలీలే నెగ్గిపోతారేమోననే విచారమూ, బెంగా, ప్రభుత్వానికి పట్టుకుంది అందుకోసమే ఏదో ఒక విధంగా శని విరగడైపోతారని "నేషనల్ గార్డు" డివిజన్లని ముందుకు నెట్టసాగేరు. జాతీయప్రభుత్వసభ్యుడు, పారిస్ మిలటరీగవర్నరూ, అయిన ట్రోచూ—"వీరికో 20 వేలమంది చచ్చేరా పారిస్ తప్పకుండా లొంగితీరుతుంది." అన్నాడు.

నగరంలోని ఆహారపదార్థాలన్నీ స్వాధీనం చేసుకొని, రేషన్ కార్డుపద్ధతి ప్రవేశపెట్టమని మొదటినుంచీ శ్రామికులు కోరుతూన్నా, పెడచెవినిపెట్టి జాగుచేయడమేగాక, ప్రజలనే మోసగించడానికి చేస్తూన్న ప్రయత్నాలు చూసినమీదట జాకోబినులూ, బ్లాంక్విస్టులూ తిరుగుబాటు చేయడానికే నిశ్చయించుకున్నారు. 1870 అక్టోబరు 31 వ తేదీన ఒకటీ; 1871 జనవరి 23వ తేదీనఒకటీ తిరుగుబాట్లు జరిగినాయిగాని, తగినంత నిర్మాణబలం లేక వోడిపోయినాయి. తీవ్రమైన ప్రతిక్రియాకలాపంతో ఆతిరుగుబాట్లు అణిచి వేయబడినాయి. జనవరి 28 వ తేదీన పారిస్ లొంగిపోయింది. ఫిబ్రవరి 6 వ తేదీన ఎన్నికలు జరిగి అప్పుడు ఏర్పడే "నేషనల్ ఎస్సెంబ్లీ" సంధి రాయబారాలు జరపాలని నిర్ణయించబడింది.

'యుద్ధమా? శాంతా' అనేదే ఎన్నికలలో తేలవలసిన ప్రధానాంశం. సోషలిస్టులు, రిపబ్లికనులు యుద్ధం జరగవలసిందేనంటున్నారు. అందువల్ల, శాంతి ఏర్పడాలంటూన్న రాచరికవాదులవైపు వోటుచేసేరు, రైతులు. నేషనలు ఎసెంబ్లీకి ఎన్నుకోబడిన 750 మందిలోనూ 450 మంది రాచరికవాదులే. కనుక అస్సెంబ్లీ ప్రష్యాతో సంధిచేసుకోడానికే

నిర్ణయించింది. అల్సేస్, లోరయిన్‌లు; 5 మిలియర్డుల ఫ్రాంకులూ ఇచ్చి సంధి చేసుకొనడానికి తయారయింది.

ఇప్పుడు వారిదృష్టి పారిస్‌వేపు తిరిగింది. రాచరికవాదులగు సేనాధిపతులలోనుంచి ఏరి, పారిస్ గవర్నరునూ, నేషనల్‌గార్డు కమాండింగ్ ఆఫీసరునూ నియమించేరు. నేషనల్ గార్డులకిస్తూన్న దినభత్యం $1\frac{1}{2}$ ఫ్రాంకులూ నిలిపివెయ్యబడింది. నిరుద్యోగం విపరీతంగా వుండడం చేత పారిస్ శ్రామికప్రజానీకానికి ఇప్పుడాభత్యమే జీవనాధారం. ముట్టడి సమయంలో తాత్కాలికంగా చేయబడిన అప్పులు. అద్దెల నిలుపుదల శాసనం రద్దుచెయ్యబడింది. సర్వనాశనం అయ్యేపరిస్థితులు శ్రామికులనీ, మధ్యతరగతి ప్రజలనీ ఎదుర్కొన్నాయి.

కాని, జరగవలసిన ముఖ్యమైనపని ఇంకా మిగిలిపోయింది. పారిస్‌లోని కార్మికుల, వృత్తిదారుల చేతులలోవున్న ఆయుధాలు లాగివెయ్యాలి, ముందు. ఆనాటిప్రభుత్వం రాజరికవాది 'ధీర్సు' చేతిలోవుంది. అతడు వెంటనే పారిస్‌లోవున్న 250 ఫిరంగుల్నీ నేషనల్‌గార్డుల చేతులలోనుంచి తీసుకుని సైన్యాల అధికారంలో వుంచాలని ఆజ్ఞాపించేడు. కాని, ఈపని మాత్రం కార్మికులు సాగనీయలేదు. మార్చి 18 న, ప్రభుత్వము, సైన్యాలతో సహా వర్సెయిల్సుకి పారిపోయింది. సైనికులలో అధికసంఖ్యాకులచేత ఎన్నుకోబడిన నేషనల్‌గార్డు కార్యవర్గసమితి అధికారం తీసుకుంది.

## కమ్యూన్

మార్చి 18 న వచ్చిన తిరుగుబాటు హఠాత్సిద్ధంగా వచ్చినదే. విప్లవసంఘాలేవీ దానికి సిద్ధంగాలేవు. ఇంటర్నేషనలుశాఖ అయిన ఫెడ

రేషను ఆరంభంలో ఆసంఘటనలలో కలుగచేసుకోవాలనే తలపలేదు. సోషలిస్టులతోనూ, శ్రామికసభ్యులతోనూ ఏర్పడిన నేషనల్‌గార్డుకమిటీ ఆబాధ్యతలు నెత్తిన బెట్టుకొనడానికి జడిసి, 'కమ్యూన్'కి ఎన్నికలు ప్రకటించింది. ఎన్నికల తర్వాత 'కమ్యూనే' అధికారం వహిస్తుంది. ఈనూతన ప్రభుత్వం సంపూర్ణంగా ప్రజాప్రతినిధిప్రభుత్వముగా వుండాలనే వుద్దేశ్యముతో జనులందరూ ఎన్నికలలో పాల్గొనడానికి అవకాశాలు కలిగించబడినాయి. మొత్తం ఈఎన్నికలలో 2,30,000 మంది పాల్గొన్నారు. ఎన్నికలు మార్చి 26 న పూర్తి అయినాయి. మార్చి 28 వ తేదీన కమ్యూన్ కౌన్సిలు అధికారం స్వీకరించింది.

కాని, నేషనల్‌గార్డ్సు సెంట్రల్‌కమిటీ రద్దుకాలేదు. ఈ కమిటీ వర్సెయిల్సుమీద దండయాత్ర జరపవలసిన ఆవశ్యకతనిగాని, జరుగుతూన్న ఘట్టాలయొక్క విప్లవ ప్రాధాన్యతగాని గుర్తించలేకపోయింది. అంతర్యుద్ధం సాగించడానికి భయపడింది. కమ్యూన్‌యొక్క ఎన్నికలలో చిక్కుకుని 10 రోజులు గడిపేసింది. ఈలోపుగా వర్సెయిల్సుకు విప్లవవ్యతిరేకదళాన్ని కూర్చుకోడానికి పూర్తి అవకాశాలు లభించేయి. తరువాత అంత శీఘ్రంగా అధికారం కమ్యూన్‌చేతులలో వుంచడంకూడా పొరపాటే. కమ్యూన్‌కంటె సెంట్రలుకమిటీ కేవలం కార్మికవర్గ ప్రాధాన్యతగలది. ఎక్కువ ఏకీభావంగలది. ఇంకా బూర్జువా పక్షంతో ఏలాగైనా సంధి కూర్చుకోవాలనే ధోరణితో, బూర్జువాలపరపున ఎన్నుకోబడ్డ 17 గురు సభ్యులూ తమ కర్తవ్యాలను నిర్వహించడానికి నిరాకరించి కార్మికవర్గం నుంచి వేరుపడ్డారు. బై - ఎలక్షన్లు జరిగాక 77 గురు సభ్యులతో కమ్యూన్ ఏర్పడింది.

మాతృభూమిని సంరక్షించేటందుకై పోరాటంలో దిగినప్పుడు

పెట్టీబూర్జువాలకీ, కార్మికవర్గానికీ కలిసిన స్నేహమే కమ్యూన్ యొక్క నిర్మాణంలోకూడా ప్రతిఫలిస్తూంది. కమ్యూన్ కమిటీలోకి 32% శ్రామికులు; 15% చిన్నవుద్యోగులు; 15% చిన్నవర్తకులు; 38% లాయర్లూ-టీచర్లూ వగైరాలు ఎన్నుకోబడ్డారు.

కమ్యూన్‌లోకూడా రెండుతెగ లేర్పడ్డాయి. ఒక తెగలో జాకొబినులు - బ్లాంక్విస్టులూ చేరేరు. వీరిదే మెజారిటీ. రెండోతెగ ప్రౌఢనిస్టులది. జాకోబినులు పెట్టీబూర్జువా అతివాదులు; సోషలిస్టులుకారు. వర్గ సమ్మేళనం కావాలనీ; అందరికీ సమానమైన న్యాయం కలగాలనీ వారి ధోరణి. ఫ్రెంచి మహావిప్లవముయొక్క ఆదర్శాలని ఆచరణలో సాగిస్తూన్నది తామేనని వారికొక గర్వం. వారికి కార్మికోద్యమం ఏమిటో అర్థం కాదు. కాలం మారడంతోనే నూతనసిద్ధాంతాలూ, నూతనకర్తవ్యాలు మానవసమాజాన్ని ఎదుర్కొంటున్నాయనే విషయమే మరచి ఏనాటివో 1793 నాటి ప్రజాతంత్రాదర్శాలనే కమ్యూన్‌లో అక్షరశః ఆచరణలో పెట్టాలని వూహించేరు.

ఎన్నో విషయాలమీద మెజారిటీ - మైనార్టీ కక్షలలో పేచీలు వచ్చేయి. స్వతంత్రములైన కమ్యూన్‌లతో కూడుకొన్న, రాజ్యాంగాధికారరహితమైన సమాజం ఏర్పడాలనీ; ప్రభుత్వం అనేది వుండకూడదనీ; నియంతృత్వం పనికిరాదనీ; మైనారిటీ కక్షవారు వోరాడేవారు. చివరకి కమ్యూన్‌లో పేచీలు ముదిరి ఒకమారు మైనార్టీకక్ష సభలోంచి లేచిపోయేవరకూ వచ్చింది. మెజార్టీపార్టీ నియంతృత్వం సాగిస్తూందని నిందించేరు. పత్రికలలో తమ అసమ్మతులు తెలియబరచేరు. వీటి అన్నింటివలనా శ్రామికవర్గంలో కొంత కలవరపాటు కలగవలసిందే గాని ఇతర కారణాలచేత ఆప్రమాదం తప్పిపోయింది.

అంతేగాదు కమ్యూన్‌కి స్పష్టమైన కార్యక్రమంలేదు. నాయకత్వంలో ఐక్యతలేదు. ఒకదానికొకటి పొందని అభిప్రాయాలతో ఎన్నో చీలికలు. ఇటువంటి దురవస్థతో పారిస్ శ్రామికులకి నాయకత్వం వహించి, అత్యవసరము, కఠినతరము నైన కార్యక్రమం సాగించడానికి నడుము కట్టవలసి వచ్చింది. పరిస్థితులు చాలా క్లిష్టంగా వున్నాయి. రాజ్యాంగయంత్రం స్తంభించిపోయింది. పెద్దవుద్యోగులు - సాధారణోద్యోగులూ అంతా వర్సెయిల్సుకి పారిపోయేరు. ఈవిధములయిన పరిస్థితుల ఒత్తిడిచేత బూర్జువా రాజ్యాంగయంత్రాన్ని ఏలావున్నదాన్ని ఆలాగే తనచేతిలోనికి తీసుకుని నడిపించడానికి వీలులేకపోయింది. దానిని ధ్వంసంచేసి తనకి వీలయినదానిని తాను నిర్మించుకోవలసి వచ్చింది. కొంచెం ఆలస్యం అయితేనేం, స్థాపించుకున్న రాజ్యాంగం అంత పరిష్కృతం కాకపోతేనేం, ఈ సమస్యకి తగిన పరిష్కారాన్ని కనిపెట్టగలిగింది కమ్యూన్. ఈవిషయంలో కమ్యూన్ అనుభవాలు 1917 లో రష్యను శ్రామికవర్గానికి బాగా ఉపకరించేయి.

కమ్యూన్ వట్టి పార్లమెంటుకాదు. అది ఒక రాజకీయపక్షం. దాని చేతులలో శాసనాలు చేసే అధికారం, అమలుపరచే అధికారం, రెండూకూడా వున్నాయి. దాని సభ్యులు ప్రతివొకరూ తమ నియోజకవర్గానికి బాధ్యులు. ఎప్పుడు కావలసినా వారిని వెనక్కి పిలిచివేసే అధికారం వుంది. ఉద్యోగులంతా ఎన్నుకోబడవలసిందే; వారినికూడా తొలగించి వేయవచ్చును. మంచిపనివానికిచ్చే జీతాన్ని మించి ఏవుద్యోగికీ జీతం యివ్వరు. స్థిరసైన్యాన్ని రద్దుచేసి, దానిస్థానే ప్రజలందరికీ ఆయుధాలనిచ్చింది. పోలీసుసిబ్బంది రద్దుచెయ్యబడింది.

ప్రభుత్వానికీ - చర్చికీ మతానికీ సంబంధం వుండకూడదని శాసించింది. మతబోధకుల చేతులలోనుంచి పాఠశాలలు తీసుకుంది. అన్ని విద్యాశాలలలోనూ ఉచితవిద్య ప్రవేశపెట్టబడింది. ఉద్యోగులందరిలాగనే న్యాయాధికారులుకూడా ఎన్నుకోబడాలి అని శాసించింది. స్వంతబాధ్యతలు కలిగి తిరిగి పిలిచివేయబడేటందుకు బాధ్యులై, వీరు ఎన్నుకోబడతారు. కమ్యూన్‌చేత తీసుకోబడి ఈచర్యలన్నీ రాజ్యాంగ యంత్రం యొక్క స్వభావాన్నే పూర్తిగా మార్చివేసేయి. పరాయివర్గాలని అణచి పెట్టేటందుకే వుపయోగపడే బూర్జువా రాజ్యాంగముగా గాక వేలకొలది కార్మికులచేత బలపరచబడిన కార్మికవర్గ ప్రభుత్వముగా మార్పుచెందింది.

తాను స్థాపించినది శ్రామికవర్గ నియంతృత్వం అనేసంగతి కమ్యూన్‌కే తెలియదు. ఆనాటికివున్న పరిస్థితులు; అంతర్యుద్ధమూ; తన వర్గశత్రువుల్ని అణచిపెట్టి నియంతృత్వం సాగించవలసిన అవసరాన్ని తెచ్చిపెట్టేయి. వర్సెయిల్సుకూటం వారి సమావేశాల్ని కమ్యూన్ నిషేధించింది. వారి ప్రెస్సును మూసివేసింది. వారి యిళ్లు సోదాలు చేయబడ్డాయి. అరెస్టులు సాగించింది. ప్రజాక్షేమవిచారణకి కమిటీని వేసింది. హోమ్ నిర్బంధితుల్ని కాల్చివెయ్యడానికి చట్టం ప్యాసుచేసింది. సాంఘిక-ఆర్థికరంగాలలో అది తెచ్చిన మార్పులు అత్యల్పం. బూర్జువాల ఆస్తులు స్వాధీనం చేసుకోవలసి యుంటుందనే సమస్యనే ఎత్తుకోలేదు. ఫ్యాక్టరీలలో జరిమానాల పద్ధతిని రద్దుచేస్తూ శాసనం చేసింది. రొట్టెలఫాక్టరీలలో కూలీలచేత రాత్రి పని చేయించడాన్ని నిషేధించింది. యజమానులు వదిలిపెట్టి పారిపోయిన పరిశ్రమల్ని కూలీలకి స్వాధీనం చేసింది.

లేబర్ ఎక్ఛేంజిని ఏర్పరచింది. వర్సెయిల్సుముఠాతోడి పోరాటంలో చని పోయిన నేషనల్ గార్డులయొక్క వితంతువులకీ, ఔరసులయినా కాక పోయినా వారి సంతానానికీ జీవనభృతులు ఏర్పరచింది. ఈశాసనాలేవీ కూడా బూర్జువాసమాజంయొక్క పునాదుల్ని కదిలించేవికావు. ఆనాటికి ఫ్రెంచికార్మికులకి సోషలిస్టు సిద్ధాంతాలు బాగా తెలియలేదనే విషయం కమ్యూన్ సాగించిన ఈ కార్యక్రమంలోనే బయటపడుతూంది.

బ్యాంక్ ఆఫ్ ఫ్రాన్సు శ్రామికుల చేతులలోనికి వచ్చింది. దాని ఆస్తులఖరీదు 3 మిలియర్డుల ఫ్రాంకు లుంటుంది. ఈడబ్బును స్వాధీనం చేసుకొనివుంటే వర్సెయిల్సుతోడి పోరాటంలో బాగా వుపయోగించి వుండేది. కాని, వారాపనిచేయక, ఆబూర్జువావర్గపుటాస్తిని ఎంతో భద్రంగా కాపాడేరు. ప్రత్యేకాస్తి హక్కుయొక్క పవిత్రత - అందరికీ సమాన న్యాయం - అనే పెట్టీబూర్జువా అభిప్రాయాలు వుండడంచేతనే కమ్యూన్ రైల్వేకంపెనీల ఆస్తులు స్వాధీనంచేసుకోవాలనే చట్టాన్నీ, అప్పులు రద్దుచెయ్యాలనే చట్టాన్నీ, వర్సెయిల్సుకి పారిపోయిన బూర్జు వాలనుండికూడా ఆస్తులు జప్తుచేయాలనే తీర్మానాన్నీ త్రోసిపుచ్చింది.

కమ్యూన్ యొక్క తప్పులేమిటి ? దానియొక్క ప్రాముఖ్యత ఎందులోవుంది ? పరిస్థితుల్ని గమనించి. వారిని నడిపించగల పార్టీ లేక పోవడం అనేది ఫ్రెంచి శ్రామికుల దురదృష్టం. ఒక్కక్షణమేనా ఆలస్యం చేయకుండా వర్సెయిల్సుమీద దండయాత్రసాగించి. శత్రువును పూర్తిగా ధ్వంసం చెయ్యడానికిబదులు, వారిమీద నైతికపువొత్తిడి తీసుకు రావాలని శ్రామికవర్గం ప్రయత్నించింది. ఇది ఒక గొప్ప తప్పు. కమ్యూన్‌తో నిమిత్తంలేకుండా సెంట్రల్ కమిటీయే పూర్తిబాధ్యతతో పనిచేసినా ఇంతకంటె మంచిపని సాగివుండేది. నియంతృత్వం అవలం

బించినా, నిర్బంధచర్య లవలంబించినా కమ్యూన్ ఎంతో వత్తిడిమీద చేసిందేగాని మరొకటిగాదు. ఆచేసిన పనికూడా, ఒక క్రమపద్ధతిలో లేదు. ఎంతో సందేహం, వెనక ముందాడడంతోనే సరిపోయింది. బ్యాంక్ ఆఫ్ ఫ్రాన్సు విషయంలో చేసినటువంటి తప్పులే, సైనిక ప్రాముఖ్యతగల విషయాలలోగూడా ఎన్నోచేసింది. తానుచేసిన సామాజిక, ఆర్థికశాసనాల్ని సగంసగంగా కాక, దృఢదీక్షతోచేసి బూర్జువా ఆస్తివిధానాలన్నీ రద్దుచేసి వుండవలసింది.

పైగా బయటి జిల్లాలతో కమ్యూనేమీ సంబంధం పెట్టుకోలేకపోయింది. లయాన్సు, మార్సెలీస్, సైంట్ ఎటీన్నీ మొదలయిన నగరాలలో కూడా పారిస్ తిరుగుబాటువార్త చేరగానే తిరుగుబాట్లు బయలుదేరేయి. కాని, ఒకదానితో వొకదానికి సంబంధం లేకపోవడంచేత అవి చులకనగా అణిచివేయబడినాయి. రైతులతో సంబంధాలు పెట్టుకోకపోవడంకూడా కమ్యూన్పతనానికి కొంతకారణం.

ఈ తప్పులన్నింటికీ మొదటి కారణం ఫ్రెంచి శ్రామికవర్గంలో వర్గచైతన్యం కలగకపోవడమే. రెండోది కమ్యూన్లో జాకోబిన్లకు గల పలుకుబడి. వీరు ఎక్కడికక్కడే అద్భుతగులుతూండేవారు. తమతోపాటు శ్రామికవర్గానికి కూడా రాజకీయజ్ఞానం కలగకుండా చేసేసేరు. తమకిగల చాంచల్యం వారికీ అంటగట్టేరు. "ప్రత్యేకాస్తి హక్కుల పవిత్రత" అనే పెట్టీబూర్జువా భావాన్ని వారికి నేర్పేరు.

ఇంక కమ్యూన్ విషయం. అది పరిస్థితున్ని సరిగ్గా అర్థంచేసుకోలేకపోయింది. నిర్మాణంలోకూడా పూర్తిలోపంవుంది. కార్యాచరణలో దృఢనిశ్చయత లేదు. కాని, అటు విప్లవనిరోధకుల పరిస్థితులేవేరు. ప్రారంభంనుంచీకూడా థీర్సు, కమ్యూన్ను నాశనంచేయాలనే దృఢ

సంకల్పంతో వున్నాడు. ఆతనికి ప్రష్యనుప్రభుత్వపు సహాయంవుంది. ఆ ప్రభుత్వం ఖైదీలుగా పట్టుబడిన ఫ్రెంచి సైనికులనందరినీ విడుదల చేసింది. పైగా, తానుకూడా సహాయం వచ్చి బూర్జువాజీకి పూర్తి సహాయం కలగచేసింది.

వర్సెయిల్సు ముఠావారి సేనలూ, జర్మనుసేనలూ పారిసును నాలుగు మూలలనుంచీ ముట్టడించేయి. మే 21 నాడు వర్సెయిల్సుసేనలు పారిసు నగరంలోనే అడుగుపెట్టేయి. ఒక వారంరోజులుపాటు కమ్యూనార్డులు వీరోచితంగా పోరాడేరు. శత్రువులు తమవద్దగల సంఖ్యాబలంచేతనే పారిస్‌ను జయించగలిగేరు. 72 రోజులపాటు జీవించి పారిస్ కమ్యూన్ మే 28 వ తేదీన పడిపోయింది. ఓడిపోయిన కమ్యూన్‌మీద బూర్జువాజీ తన కసితీర్చుకుంది. మృత్యువు నగరంలో తాండవించింది. కొద్దిరోజులలోపులో 25,000 మంది కాల్చి చంపివేయ బడ్డారు. 13,700 మందికి మరణాంత శిక్షలు విధించి, జ్వరాలపుట్టలయిన న్యూ-కెలిడోనియా పర్వతాలమధ్య బంధించేరు. బూర్జువాల పవిత్ర ఆస్తి హక్కుల్ని ఎవరయినా ముట్టుకొనదలచేరా వారిపై ఎటువంటి భయంకర ప్రతీకారం విధించబడుతుందో ప్రపంచానికిచాటి చెప్పబడింది.

## కమ్యూన్‌నుగూర్చి మార్క్సు, లెనిన్‌ల, సోషల్‌డెమోక్రాట్ల అభిప్రాయాలు :

ఫ్రాన్సు - ప్రష్యను యుద్ధకాలంలో ఫ్రాన్సులో కలుగుతూన్న పరిణామాలను మార్క్సు అతిజాగరూకతతో పరిశీలించేడు. శ్రామిక సంఘాల దౌర్బల్యాన్నీ, అవి పోరాటానికి తగిన పరిస్థితులలో లేక పోవడాన్నీ గమనించి జాతీయప్రభుత్వానికి ఎదురుతిరగవద్దని సలహా

నిచ్చేడు. అప్పుడు లభించిన సౌకర్యాల్ని తమస్థితిని బలపరచుకుందుకే వినియోగించమని హెచ్చరించేడు. కాని, కమ్యూన్ ఏర్పడినాక మార్క్స్ దానికి బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చేడు.

1871 ఏప్రియలు 12 వ తేదీన ఆతడు "కూగల్మన్"కు ఒక జాబువ్రాసేడు.

"ఏమయితేనేంగానీ, ఈనాటి పారిస్ తిరుగుపాటు, పూర్వ సమాజంతాలూకు తోడేళ్ళు, రక్తదాహంగల కుక్కల దయాధర్మాలమీద ఆధారపడివుంటేనేంగాక, జూన్ తిరుగుబాటు తర్వాత మన పార్టీసాగించిన మహత్తర విషయాలలో ఒకటి. స్వర్గాన్నే ముట్టడిస్తూన్న ఈపారిస్ కార్మికుల్ని, జర్మన్, ప్రష్యన్, హోలీ - రోమన్ సామ్రాజ్యవాద కుబ్జలతో పోల్చిచూడు."

ఏప్రియలు 17 న కూగల్మన్‌కి వ్రాసిన మరొక జాబులో -

"పారిస్" కార్మికవర్గం పోరాటం జరపకుండానే ధీర్పుకి లొంగిపోయివుంటే, శ్రామికవర్గంలో కలిగే నైతికపతనం ఎందరో నాయకులు నష్టమైన దానికంటేనూ ఎక్కువనష్టం కలిగించివుండేది. ఈ పారిస్ కమ్యూన్‌తో పెట్టుబడిదారులతోను - వారి ప్రభుత్వంతోనూ కార్మికవర్గం సాగించే పోరాటంలో ఒక నూతన ఘట్టం ప్రారంభం అయింది. దీని ఫలితం ఏలాగవుండనీగాక, ప్రపంచచరిత్రలో విశేషప్రాముఖ్యతగల ఒక నూతన విషయం కనిపెట్టబడింది."

పారిస్ కమ్యూన్ ఓడిపోయిన రెండురోజులు తర్వాత మార్క్స్ వ్రాసిన 'ఫ్రాన్సులో అంతర్యుద్ధం' అనే పుస్తకంలో ఆతని అద్భుత మేధావిత్వం కనబడుతుంది. దానిలో కమ్యూన్‌యొక్క ప్రాముఖ్యతని వివరిస్తూ, దాని అనుభవాలనీ, తప్పుల్నీ పూర్తిగా విమర్శించేడు.

"కమ్యూన్ శ్రామికవర్గప్రభుత్వమే. దానిలో ఎంతమాత్రం సందేహంలేదు. ఉత్పత్తిదారులతోటీ, ఆస్తిస్వామ్యాలు గలవారితోనూ జరిపే పోరాటానికి ఫలితంగా ఎటువంటి రాజ్యాంగం వచ్చి శ్రామికుల ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెడుతుంది? అనే విషయం ఏలాగైతేనేం కనిపెట్టబడింది."

మార్క్స్ దృష్టిలో కమ్యూన్‌కిగల ప్రాముఖ్యత ఇదే. ఏంజిల్సు అభిప్రాయాలూ అంతే.

ఇరువురూ కమ్యూన్‌ను శ్రామికవర్గ నియంతృత్వమేనన్నారు. "తనచేత చిక్కిన బూర్జువా రాజ్యాంగయంత్రాన్ని చల్లగా తీసుకుని శ్రామికవర్గం తనకి వుపయోగపడే విధానంలో దానినే నడుపుకోలేదు"—శ్రామికవర్గం ఇందుకు కేవలమూ వ్యతిరేకంగా—"ఆయంత్రాన్నే విధ్వంసం చేయాలి" (మార్క్స్ కూగల్మన్‌కి వ్రాసిన జాబులో) అనే విషయం కమ్యూన్‌వలన బోధపడినదంటూ మార్క్స్, ఏంజిల్సులు దానికి విశేషప్రాముఖ్యత నిచ్చేరు. కమ్యూనిస్టు మానిఫెస్టోలోవారు చేసిన సంస్కరణ ఇదొక్కటే. మార్క్స్ ఎంతో జాగ్రత్తగా కమ్యూన్ యొక్క అనుభవాల్ని పరిశోధించేడు—రాజ్యాంగాన్ని ధ్వంసంచేసేక ఎటువంటి నూతన నిర్మాణాలు నిర్మించుకుందో—జాగ్రత్తగా పరిశోధించేడు. స్థిరసైన్యాన్ని రద్దుచెయ్యడం, వుద్యోగుల ఎన్నికలు; వారిని తొలగించేటందుకు హక్కు; సాధారణ కూలీలతోసమంగా వారికి జీతాలు ఏర్పరచడం; చర్చికీ - ప్రభుత్వానికీ సంబంధం లేకుండా చెయ్యడం; పోలీసుదళాలు రద్దుచెయ్యడం; మొదలగు వానిని జాగ్రత్తగా గమనించేడు. "వర్గపరిపాలనా పద్ధతులలో ఒకటైన రాచరిక విధానాన్నే కాదు, అసలు వర్గాధికారాన్నే నాశనం చేయగల ప్రజాస్వామ్యమును" గా పై పద్ధతులతో మార్చేరన్నాడు మార్క్స్.

బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికీ కమ్యూన్‌కీ ఎక్కడా పోలికే లేదన్నాడు.

"కమ్యూన్ వట్టి పార్లమెంటరీ సంస్థకాదు. కార్యకారిణీసంస్థ. చట్టాలుచేసేదీ - పాలించేదీకూడా అదే..........పాలకవర్గంతాలూకు ఏసభ్యుడు తమకు ప్రతినిధిగా పార్లమెంటులో (మూడేళ్ళో - ఆరేళ్ళో) కూర్చోవాలో నిర్ణయించేటందుకు మాత్రమేకాదు సార్వజనికవోటు హక్కు యొక్క వినియోగం. వ్యక్తిగతఆస్తిహక్కు కారణంగా యజమాని తనక్రింద పనిచెయ్యవలసిన కూలీలనీ, మేనేజర్లనీ ఏరుకోగలుగుతూన్నట్లే, అదేమాదిరిగా ఈఓటుహక్కు కమ్యూన్‌లో సభ్యులయిన వారందరిక్షేమం కోసం తగిన మనుష్యుల్ని యేరుకొనడానికి పనికి వస్తుంది."

బూర్జువా ప్రజాస్వామ్యానికీ కమ్యూన్‌కీగల భేదాలను ఏంజిల్స్ ఇంకా విశదీకరించేడు. 1891 లో ఆతడు 'ఫ్రాన్సులో అంతర్యుద్ధం' అనే గ్రంథం యొక్క మూడవకూర్పుకి పీఠిక వ్రాస్తూ..

'ఫ్రాన్సులో అంతర్యుద్ధం' యొక్క మూడవభాగంలో అంతక్రితంవున్న రాజ్యాంగం ఏవిధంగా ధ్వంసం చేయబడిందో, దాని స్థానే నూతన రాజ్యాంగం స్వచ్ఛమైన ప్రజాతంత్ర పద్ధతులపై ఏలానిర్మించబడిందో స్పష్టంగా మార్క్సు వ్రాసేడు. ఇక్కడ మరికొన్ని విషయాల్ని గురించి చెప్పవలసివుంది. ముఖ్యంగా జర్మనీలో.........వంశక్రమాగతమైన చక్రవర్తిత్వానికి బదులు, ప్రజాతంత్ర ప్రభుత్వం ఉండాలని తలచడమే గొప్ప ఘనకార్యంగా వూహిస్తూన్నారు నిజానికి ప్రజాతంత్రమైనా, ఏకాధిపత్యమైనా, ఏదైనా సరే,—ఒక వర్గాన్ని అణిచిపెట్టేటందుకు రెండోవర్గం ఉపయోగించే ఒక యంత్రం మాత్రమే అది."

జర్మను ఛాందసుల్ని సవాలుచేస్తూ ఏంజిల్సు తనపీఠిక ముగించేడు.

"నియంతృత్వం ఏలావుంటుందో చూసేరా? పారిస్ కమ్యూన్ వేపు చూడండి. అదే శ్రామికవర్గనియంతృత్వం అంటే."

కమ్యూన్‌యొక్క అనుభవాలమీద మార్క్సు - ఏంజిల్సులు తేల్చిన సారాంశం ఇది. కాని, రెండో ఇంటర్నేషనలులోని సంస్కరణ వాద నాయకులు వీటిని మరచిపోయేరు. తమ ఇష్టం వచ్చినట్లుగా అర్థాలు తీసేరు మరికొందరు. 1917 అక్టోబరుకి కొద్దిమాసాలు ముందు లెనిన్ 'రాజ్యాంగయంత్రం—విప్లవం' అంటూ ఒక పుస్తకం వ్రాసేడు. మార్క్సిజానికి సంస్కరణవాదులు చెప్తూన్న అపార్థాలని అందులో తీవ్రంగా ఖండించేడు. మార్క్సు అభిప్రాయాల్ని ధృవపరుస్తూ, కమ్యూన్ విషయంలో కొన్నివివరాలు వ్రాసేడు. మార్క్సుయొక్క నిజమైన భావా లేవో బయటపెట్టేడు. మార్క్సుయొక్క భావాల్నే రష్యను శ్రామికులు లెనిన్ నాయకత్వాన అమలులో పెట్టేరు. కమ్యూన్‌యొక్క పొరపాట్లేవో తెలుసుకోగలగడంచేతనే అక్టోబరు విప్లవంలో మళ్ళీ అవే తిరిగి జరగ కుండా సర్దుకోగలిగేరు.

1914 మహాయుద్ధానికి పూర్వం సోషల్ డెమాక్రాట్లు, మార్క్సి జానికి పెడర్థాలు మాత్రమే తీసేరు. కాని, నేడు దానిని స్పష్టంగా ఎది రిస్తూన్నారు. "ఆసమయంలో వూరుకొనేవుంటే ఫ్రెంచి శ్రామికులు అంత కంటె ఎక్కువ నష్టాన్ని పొందివుండేవారు." అనే రోజా లగ్జెంబర్గు అభిప్రాయాల్ని (1898) సంస్కరవాదనాయకులలో ఒకడైన 'వాల్మరు' జర్మను సోషల్ డెమాక్రాటిక్ కాంగ్రెసులో ఎదిరించేడు.

"మనపార్టీచేసిన మహత్తరసాధనం" అంటూ కమ్యూన్‌కి

స్వాగతం ఇచ్చిన మార్క్సు అభిప్రాయాలకీ, వాళ్ళరు అభిప్రాయాలకీ ఎంత తేడావున్నా, కమ్యూనిస్టు మొట్టమొదటి శ్రామికవర్గనియంతృత్వం అనే మార్క్సు అభిప్రాయాన్నిమాత్రం కాదనలేకపోయేడు. ఈ నాటి సోషల్ డెమాక్రాట్లలోనున్న మరోవిశేషం ఏమిటంటే శ్రామికవర్గ నియంతృత్వం అనే శబ్దాన్నే తోసిపుచ్చి బూర్జువా సామాజికవిధానానికి మూల స్తంభాలుగా తయారయ్యేరు.

శ్రామికవర్గవిప్లవానికి పరమద్రోహియైన కారల్ కాట్స్కీ 'కమ్యూనిస్టు మానిఫెస్టో అండ్ డెమాక్రసీ' అనే వ్యాసంలో పారిస్ కమ్యూన్ కేవలం ఒకప్రాంతీయ సంఘటన మాత్రమేననీ, కార్మికవర్గానికి ఈ పెట్టుబడిదారీ సామాజిక విధానాన్ని మార్పుచేసే అభిప్రాయమేవుంటే వారు విప్లవధోరణినీ, అంతర్యుద్ధవిధానాన్నీ వొదులుకోవాలనీ వ్రాసేరు.

సోవియటు యూనియనులో ఏర్పడిన శ్రామికవర్గనియంతృత్వం ఎడల తనకున్న అసహ్యంఅంతా కక్కుతూ కాట్స్కీ, తాను వ్రాసిన "ప్రజాతంత్రాన్నుంచి ప్రభుత్వ బానిసత్వానికి" అనే కరపత్రంలో అసహ్యకరమైన "శ్రామికవర్గనియంతృత్వం" అన్న శబ్దాన్నే పూర తొక్కండి! అని జర్మను కార్మికులకి సలహా ఇచ్చేడు.

"శ్రామికవర్గనియతృత్వం అనే శబ్దాన్నే మరచిపోవలసిన అవసరాలు చాలా వున్నాయి. అది ఎన్నో దురభిప్రాయాలకి తావిస్తూంది. 1917 కి పూర్వం మార్క్సిస్టు వాఙ్మయంలో కేవలం వాదనకోసమే ఆపదం వాడబడింది. అంతేగాని, ప్రచారం కోసం ఉద్దేశించబడలేదు."

మార్క్సు-ఏంజిల్సులు తప్పిజారి అన్నమాట పట్టుకొని ఎందుకు పాకులాడాలంటాడు, కాట్స్కీ!

"మార్క్స్ - ఏంజిల్సులు శ్రామికవర్గ నియంతృత్వాన్ని ఉదాహరించేరని మాటిమాటికీ బోల్షివిక్కులు వారివేపు చూస్తూంటారు. వారిరువురూ ఆశబ్దం ఎటువంటి అర్థం ఇస్తుందో వూహించకుండానే అప్పుడప్పుడు ఉపయోగిస్తూ వచ్చేరు. ఈనాడు అదే బోల్షివిక్కులకి ఒక కార్యక్రమం అయిపోయింది.

ఈ విధంగా రెండో ఇంటర్నేషనలులోని సిద్ధాంతవేత్తలు మార్క్సు సిద్ధాంతాల్నే తారుమారుచేసారు. మార్క్సు శ్రామికవర్గనియంతృత్వానికి ఎంతప్రాముఖ్యత నిచ్చేదో ఆతనివ్రాతలలోనే కనబడుతూంది. 1852 లో "వైడెమేయర్" కి మార్క్సు ఒకజాబు వ్రాస్తూ, వర్గాల్నీ - వర్గకలహాన్నీ కనిపెట్టడంలో తను పడ్డపాటేమీ లేదనివ్రాసేడు.

"నాకంటె చాలాకాలం ముందుగానే బూర్జువా చరిత్రకారులు వర్గకలహాల చారిత్రక పరిణామాన్ని కనిపెట్టేరు. బూర్జువా అర్థశాస్త్రవేత్తలే, వర్గాలయొక్క ఆర్థిక వివరణలు వ్రాసిపెట్టేరు. నేను కనిపెట్టినది కేవలం కొత్తవిషయం. వర్గాలకీ - ఉత్పత్తియొక్క అభివృద్ధిలోకలిగే పోరాటాలకీ సంబంధం వుందనేది, ఒకటి. వర్గపోరాటం శ్రామికవర్గ నియంతృత్వానికి దారితీస్తుందన్నది, రెండోది. ఈనియంతృత్వం వర్గాలనే రద్దుచేసి, వర్గరహిత సమాజానికి దారితీస్తుందనేది, మూడోది."

(లెనిను "రాజ్యాంగం - విప్లవం"లో ఉదాహరించేడు.)

కాట్స్కీ దృష్టిలో తప్పిజారి అన్నమాటే మార్క్సు సిద్ధాంతాల కల్లా మూలకందం అన్నవిషయం స్పష్టంఅయిందిగదా ?

కొందరు సోషల్ డెమాక్రటిక్ సిద్ధాంతవేత్తలు కాట్స్కీనికూడా తలదన్నేరు. వారు రాజ్యాంగానికి సంబంధించిన మార్క్సు అభిప్రాయాలనే నిరసించి, ఉదారఅరాజక వాదానికి అనుకూలంగా మాటలాడు

తూన్నారు. "కూనో" తన "మార్క్సియన్‌థియరీ ఆఫ్ స్టేట్" అనే పుస్తకంలో "ఆధునిక రాజ్యాంగయంత్రం" ఒక్క ఆర్థిక వ్యవహారాలలోనేగాక "అన్నిటిలోనూ వేలుపెడుతూంది"—"వ్యక్తిగత - కుటుంబగత వ్యవహారాలలోకూడా అది కలుగచేసుకుంటూంది" అన్నాడు.

"ఆకాలంనాటి ఉదారఅరాజకవాద ధోరణులతో బాగా పరిచితులయిన మార్క్సు - ఏంజిల్సులు ఊహించినదానికి కేవలమూ వ్యతిరేక విధానాన్ని అనుసరిస్తుంది రాజ్యాంగవిధానం."

(కూనో : రాజ్యాంగాన్నికూర్చి మార్క్సు సిద్ధాంతాలు)

ఈద్రోహుల దృష్టిలో కమ్యూన్ యొక్క అనుభవాలకి ఏమాత్రమూ విలువలేదు. శ్రామికవర్గ నియంతృత్వాన్ని వారుఎన్నడూ అంగీకరింపలేదు, వీరు కమ్యూన్ సాధించిన విప్లవకరకార్యాలపై పేనా తిరిగి చూడరు. బోల్షివిక్కుల్ని పట్టుకు తిట్టడం వీరిపని. మార్క్సు, కమ్యూన్ ఏతప్పులు చేసిందన్నాడో వాటినే వర్సెయిల్సు ముఠాతోడి పోరాటంలో వారు చూపిన మెత్తదనం, అస్థిరత్వం, కంగారు, అంతర్యుద్ధం ఆరంభించడానికి వారు చూపిన అయిష్టత, దానిని తీవ్రంగా - కొసకంటా సాగించడంలో వారు చూపిన అయిష్టత,—వీనినే పారిస్ కమ్యూన్ చేసిన ఘనకార్యాలని పొగిడేరు!

నేటి అహింసావాదులకి (పాసిఫిస్టులకి) పితామహు డనదగిన (ఇంటర్నేషనలులో సభ్యుడు), పెట్టీబూర్జువావక్త లూయీ బ్లాంకూ, ఆ కమ్యూన్ రోజులలో వర్సెయిల్సుముఠాతో పోయి చేరేరు. మళ్ళీ మన ఈశకంలో నాస్కీ, జోర్గీబెల్, కాట్స్కీ, హీల్ఫర్‌డింగ్‌లు విప్లవకరశ్రామికవర్గాన్ని అణిచిపెట్టి, పెట్టుబడిదారి విధానాన్ని రక్షించడానికి నడుముకట్టేరు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B190 |
| పుస్తకం పేరు | ప్రపంచకార్మికోద్యమచరిత్ర |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | veena |
| స్కాన్ చేసినది | KASIMBI |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |